

# జాతక నాడీ నిధి

## మొదటి భాగము

(లగ్నము, రాశి, పుట్టిన సమయము, దశా భుక్తులు మొదలగువాటితో సంబంధం లేకుండా జాతక చక్రం వివరించుట) భృగు పద్ధతిలో



# అంకితం



ఈ పుస్తకము నా జననీనకులకు మరియు నా ప్రథమ గురువులకు

శ్రీమతి కృష్ణవేణమ్మ మరియు మెంటా సుబ్రహ్మణ్యంగారులకు.

# తొలిమాట

నేను ఒక సామాన్య మానవుడిని నాకు 20 సంవత్సరముల వరకు అందరు మానవులు వలే నా గురించి నేను తెలుసుకోవాలనీ జిజ్ఞాస ఎక్కువగా ఉండేది. అందుకు ఎంతో మంది మిత్రులను, పండితులను, స్వాములను నా జాతకం తెలుసుకొనుటకు సంప్రదించేవాడిని. వారు దానికి తగు విధముగా సమాధానము ఇచ్చేవారు. ఒక్కరు చెప్పిన పద్ధతికి మరొకరు చెప్పిన పద్ధతికి నా జాతకం గురించి ఫలిత నిర్ధారణలో కొంత భేదం కనపడేది. అప్పుడు మా తండ్రిగారిని సంప్రదించగా వారు చెప్పిన విషయం ఏమిటి అంటే మనది గత 7 తరాలు నుంచి జ్యోతిష్యుల వంశము. కావున నీవు జ్యోతిషంలో ప్రాథమిక అంశాలు నేర్చుకుంటే నీవు సంప్రదించిన జ్యోతిష్యులు ఎంత మాత్రం నిజం చెప్తున్నారు అని చెప్పి నీకు నువ్వే గ్రహించవచ్చు. ఈ విధంగా నా జ్యోతిష్యం యొక్క ప్రస్తావన 20వ సంవత్సరములోనే మొదలైన్నది. అదే సంవత్సరంలో నా తండ్రిగారు తనకు తెలిసిన ప్రాథమిక అంశాలను నాకు నేర్పించారు. అంతేకాక ఈ ప్రాథమిక అంశాలు నీవు చెప్తున్నది నిజమో కాదో తెలుసుకోవాలంటే మార్కెట్‌లో కొంత మంది నిష్ణాతులైన వారు రాసిన పుస్తకం దొరకతాయాని వాటి ద్వారా మరి కొంత విషయాలు తెలుసుకొనబడును అని చెప్పినారు. నేను నా 20 వ సంవత్సరంలో నెల్లూరు జిల్లాలోని గూడూరు మండలంలో ఉండేవాడిని. అందులో 1,2 పుస్తకాలు మాత్రమే ఉండేవి. ఆ పుస్తకములు నేను చదివి అందులో చివర పుస్తకము యొక్క ప్రచురణకర్త చిరునామాను చూసి వెళ్ళి కలిసాను. అందుకు ఆయన చెప్పిన విషయం ఏమిటి అంటే నీకు జ్యోతిష్యం నేర్చుకోవాలనే పట్టుదల మరియు జిజ్ఞాస ఉన్నది. ఈ రోజులో జ్యోతిష్యం ఎవరు నేర్పించరు. కానీ యూనివర్సిటీలో దీనికి సంబంధించి పి.జి. విద్య ఉన్నది. నువ్వు ఇదే జిజ్ఞాసతో వెళ్ళి అక్కడ ఆ విద్య ఆవలంబించి అందులో నిష్ణాతులవమని అశీర్వదించెను. నేను ఆయన చెప్పిన విధంగా ఆంధ్రప్రదేశ్‌లోని తెలుగు విశ్వవిద్యాలయంలో యం.ఎ. (ఆస్ట్రాలజి) పూర్తి చేసాను. అక్కడ పండితుల ద్వారా పుస్తకంలో లేని విషయలు కూడ కొన్ని తెలుసుకున్నాను. నా 23వ సంవత్సరం నుంచి పరాశర మహర్షి వ్రాసిన వైదిక జ్యోతిషం మును నాకు ఉన్న విజ్ఞానంతో అందరికి పంచేవాడిని. కానీ ఈ పరాశర జ్యోతిషం వలన ఒక మనిషి జననం, తేది, సమయం ఉంటేనే మనిషి యొక్క జ్యోతిష్యం పరిపూర్ణంగా తెలుసుకోవచ్చు.

పై చెప్పబడిన వివరాలు ఏవి లేనప్పుడు ప్రశ్నాలగ్నం ద్వారా మనం తెలుసుకునే అవకాశం ఉన్నది. కానీ ఫలిత నిర్ధారణలో ఈ ప్రశ్నాలగ్నము విజయం సాధించలేదు అని చెప్పవచ్చు. ప్రశ్నాలగ్నం మీద పట్టులేక ఫలితములు రాబట్టుట కేవలం నా యొక్క లోపమే గ్రంథ కర్తలు కాదు అని మనవి. ఈ విధంగా నేను పరిశోధించేటప్పుడు నాకు ఆర్.జి. రావు గారు రాసిన భృగునాడికి సంబందించిన విశేషాలు ఆయన పుస్తకంలో నేను చూడడం జరిగింది. ఆరోజు నుంచి ఈ రోజు దాకా భృగునాడికి సంబంధించిన విశేషాలు తెలుసుకుంటూ ఉంటాను. తెలుసుకున్నవి ప్రతి ఒక్కరికి పంచుతాను. ఈ ప్రయత్నానికి నేను నిత్యం ఆరాధించే శ్రీరాజరాజేశ్వరి దేవి అన్ని విధములుగా అండగా ఉండి నా ప్రయత్నమును సఫలీకృతం చేస్తుందనే భావిస్తున్నాను.



**రచయిత : యం.వి.యస్. అజయ్‌కుమార్**

**యం.ఎ. అస్ట్రాలజి మరియు న్యాయవాది**

# విషయ సూచిక

1. భృగునాడి గురించి పరిచయం
2. 27 నక్షత్రములు ( తారాబలము చూచుకొనుటకు)
3. 27 నక్షత్రములు (12 రాశులకు సంబంధము)
4. ద్వాదశ రాశులు – అంగములు
5. చర, స్థిర, ద్విస్వభావ రాశులు
6. గ్రహములు – స్వక్షేత్రము
7. నవగ్రహములకు – ఉచ్ఛ, నీచ
8. నవగ్రహములకు – మూలత్రికోణములు
9. నవగ్రహములు – దృష్టులు
10. నవగ్రహములు – వర్ణములు
11. నవగ్రహములు – గుణములు
12. నవగ్రహములు – రంగులు
13. నవగ్రహములు – దిక్కులు →
14. గ్రహయుద్ధం
15. గ్రహములు – వక్రత్వం
16. పంచమహాపురుషయోగములు , రుచిక యోగము
17. ద్వాదశభావాల నుండి తెలుసుకోదగ్గ విషయాలు మిగిలిన వివరాలు పరిశీలించండి.

| | | |
|---|---|---|
| → | మొదటి భావము | సప్తమ భావము |
| | ద్వితీయ భావము | అష్టమ భావము |
| | తృతీయ భావము | నవము భావము |
| | చతుర్థ భావము | దశము భావము |
| | పంచమము | ఏకాదశ భావము |
| | షష్టభావము | ద్వాదశ భావము |

18. గ్రహములు – దేవుడును పేర్లు వచ్చు విధానం
19. దేవతలు పేర్లు వచ్చు విధానం
20. గ్రహములు మరియు వాటి కారకత్వములు
21. పరివర్తన యోగం

22. హోరాకాలము

23. గోచారం

24. జాతకచక్రములో వివిధ గ్రహాల మీద గోచారంలో చంద్రుడు ప్రవేశించినప్పుడు వచ్చు ఫలితాలు

25. గురువు గోచారంగా జాతక చక్రంలో వివిధ గ్రహాల మీద సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు

26. వివిధ రాశులలో గ్రహాలు మీద గోచారంలో శని సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు

27. జాతకంలో రాశిలోని వివిధ గ్రహాల మీద గోచారంలో రాహువు సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు

28. కేతువు గ్రహం రాశి చక్రంలోని వివిధ గ్రహాల మీద గోచారంలో సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు

29. ఫలితవిభాగాలు

30. రవిగ్రహం

31. రవిగ్రహము వివిధ రాశులలో సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు

32. రవిలో ఇతరగ్రహాల ఏర్పడు ఫలితాలు

33. చంద్రుడు వివిధ రాశులలో సంచరించనప్పుడు ఏర్పడు ఫలితాలు

34. కుజుడు వివిధ రాశులలో సంచరించనప్పుడు ఏర్పడు ఫలితాలు

35. కుజుడు వివిధ గ్రహాల కలయిక వల్ల ఏర్పడు ఫలితాలు

36. బుధుడు వివిధ రాశులలో ఉన్నప్పుడు ఇచ్చు ఫలితం

37. బుధుడు వివిధ గ్రహాల కలియిక వల్ల వచ్చు ఫలితం

38. గురుగ్రహం వివిధ రాశులలో సంచరించనప్పుడు ఏర్పడు ఫలితాలు

39. గురుగ్రహం వివిధ గ్రహాల కలయిక వల్ల ఏర్పడు ఫలితాలు

40. శని, శుక్రుడు వివిధరాశులలో సంచరించనప్పుడు ఏర్పడు ఫలితాలు

ఉద్యోగం (భార్యని చూచు పద్ధతిలో దీనిని గ్రహించవలెను)

41. పంచ మహాపురుష యోగాలు

| | |
|---|---|
| రుచిక యోగము | సునఫాయోగం |
| భద్రయోగము | అనఫాయోగం |
| హంసయోగము | కేంద్రదూమయోగం |
| మాలవ్యయోగము | వేశియోగం |
| శశ యోగము | వాశియోగం |

42. కాలసర్పయోగము / దోషము

43. కుజదోషము / నాగదోషము

44. వైద్యజ్యోతిషం

45. పిత్తముకు సంబంధించిన గ్రహములు

46. కఫానికి సంబంధించిన గ్రహములు

47. వాతమునకు సంబంధించిన గ్రహములు

48. జలుబుకు సంబంధించిన సమస్యలు

49. కంటికి సంబంధించిన సమస్యలు

50. చెవికి సంబంధించిన సమస్యలు

51. ముక్కు సమస్యలు

52. గొంతుకు, చర్మమునకు సంబంధించిన సమస్యలు

53. రక్తం, పంటికి సంబంధించిన సమస్యలు

54. ఆయాసం

55. హృదయమునకు సంబంధించిన సమస్యలు

56. కళ్ళకు సంబంధించిన సమస్యలు

57. విదేశీ ప్రయాణము

58. విద్యాభ్యాసము

59. సంతానయోగం

60. మోక్షయోగం

61. అనుబంధము

62. ఉదాహరణ జాతకాలు

ఓం గణపతేనమః శ్రీ దత్తాత్రేయనమః

శ్రీరాజరాజేశ్వరీనమః

దర్పణం మానవులు ప్రతిబింబాన్ని ఏ విధముగా చూపించి మానవుని ఆశ్చర్యం పొందేట్లు చేస్తుందో ఈ జోతిష్యశాస్త్రం భూత, వర్తమాన, భవిష్యత్తు కాలాన్ని తెలుసుకొనుటకు ఎంతో ఉపయోగపడును. కాకి రెట్ట నుంచి రావి వృక్షం ఎట్లా పుట్టునో జ్యోతిష్యశాస్త్రం ద్వారా మానవునికి కలుగు ఉపయోగాలు మాటలకు అందని, వర్ణించలేని ఉపయోగాలు ఎన్నో ఉండును. జోతిష్యశాస్త్రం అధ్యయనం చేయని, రాయని మహర్షి లేడు. జోతిష్యశాస్త్రంలో భృగునాడికి ఒక ప్రత్యేకత ఉన్నది. ఈనాడు సమాజంలో మనకు భృగువు, జెమిని, పరాశార మతములు ప్రాచుర్యములో ఉండి ప్రజలను ఈ జోతిష్య శాస్త్రం ద్వారా చైతన్యవంతులుగా చేయుచున్నవి. ఈ భృగు మతము అత్యంత ప్రాచీనమైనది. ఈ భృగు మహర్షి భవిష్య శాస్త్రమును మానవునికి విఘ్నేశ్వరుని కృపతో వెలువరించినట్లుగా మనకు శాస్త్రముల ద్వారా తెలియుచున్నవి.

ఈ భృగు నాడి పద్ధతిలో భృగు మహర్షి భగవంతుడు అయిన నందికేశ్వరుడిని ప్రార్థిస్తే, మహర్షి భృగువు భవిష్యశాస్త్రమును ఆయనకు విన్నవిస్తూ ఉండటం ఈ భృగు సంహింతలోనూ మనకు ఎక్కువ కనపడును. అదే విధంగా సప్తఋషి నాడిలో పార్వతీమాతకు ఋషులకు జోతిష్య శాస్త్రంలో చర్చ మనకు గోచరించును. మనకు అనేక నాడి శాస్త్రములు ఆ సమాజంలో అందుబాటులో ఉన్నాయి. అందులో శనినాడి, భుద నాడి, గురునాడి, శుక్రనాడి, మంత్రనాడి, భృగునంది నాడి, శివనాడి, శుక్రర్ నాడి, అగస్త్య నాడి, గణేష్ నాడి, కుమార నాడి, కామాక్షి నాడి, ఈశ్వరనాడి, ఈ విధంగా మనకు చాలా నాడి శాస్త్రములు ప్రజలకు అందుబాటులో ఉండి మిక్కిలి ఉపయోగ పడుచున్నవి. ప్రతి నాడి శాస్త్రాలలో 16 ఖండములు ఉంటాయి. అందులో 12 ఖండములు రాశి చక్రాలు, 12 ఇళ్ళను, 13వ ఖండము దశాభుక్తి, 14వ ఖండం పరిహారములు, 15వ ఖండము దీర్ఘాయువు మరియు 16వ ఖండము ఔషదము తెలియచేయును.

17వ ఖండమును జ్ఞాన ఖండము అంటారు. ప్రతి ఖండమునకు దేవత అధిపతిగా ఉంటారు.

ఉదా:- 1. వివాహానికి పార్వతి పరమేశ్వర్లు

2. సంతానానికి కృష్ణుడినికిగాని, కుమారస్వామి అధిపతిగా ఉంటారని తెలుపుతాయి.

ఈనాడు సమాజంలో పరాశర పద్ధతిలోని వింసోత్తరీ దశ పద్ధతి మిక్కిలి ప్రాచుర్యం పొంది సాధారణమైన మానవునికి పై చెప్పిన పద్ధతి తప్ప వేరొక పద్ధతి లేదని అపోహాలో ఉన్నారు. దానికి తగ్గట్లే సమాజంలో పై చెప్పిన పద్ధతికి మిగతా జ్యోతిష్యులు కూడా దానికి సంబంధించిన పుస్తకాలు మాత్రమే ప్రచురించి పాఠకులకు ప్రజలకు సమాజంలో దగ్గర అవుతున్నారు. కాని నిజానికి పై పద్ధతులు ఒక్క జాతకాన్ని పరిశీలించాలంటే రాశిచక్రం, భావ చక్రం, షొడ శవర్గులు, అష్టక వర్గలు, సుదర్శన చక్రం, లగ్న బలాన్ని, చంద్రబలాన్ని, సూర్యబలాన్ని పరిశీలించి జాతకుని యొక్క కర్మ ఫలాన్ని తను నేర్చుకున్న విద్యను గురువు ఉపదేశం ద్వారా జ్యోతిష్యుడు దైవిజ్ఞక లక్షణాలతో

వివరించడం జరుగుతున్నది. కాని భృగునాడి జ్యోతిష్యంలో జాతక పరిశీలన గ్రహాల యొక్క కార్యకత్వముల ద్వారా పరిశీలించవలెను. ఈ భృగునాడిలో ప్రత్యేకత ఏమి అనగా ఇక్కడ లగ్నము, రాశి, దశ, అంతర్దశ మొదలైన విషయాలకు గుర్తింపు ఇవ్వరు. భ చక్రము నిర్మించుకొని గ్రహాలను ఏ నక్షత్రంలో ఉందో, ఎన్ని డిగ్రీలు గతించిందో తద్వారా భచక్రంలో ఆ గ్రహాన్ని ఉంచి ఫలితాన్ని జ్యోతిష్యుడు వివరిండం జరుగుతున్నది. ఇందులో ఒక గ్రహాన్ని అనుసరించే జాతకుని యొక్క విషయములే కాక అతను సంబంధించిన ప్రతి ఒక్కరి విషయాలను కనుగొనవచ్చు.

ఉదా: ఒక జాతకుడు శ్రవణ నక్షత్రం రోజు పుట్టాడు. అంటే అతను మకరరాశికి చెందినవాడు అయివున్నాడు. కాబట్టి ఈ జాతకుడు వృత్తులను తరచు మార్చుడం, వృత్తిలో నీలాపనిందలు జరుగుతుంది. అదే మకరరాశిలో కుజుడు ఉచ్ఛ కనుక అనగా జాతకుని/డి తల్లికి పాత ఇల్లుగాని స్థలం అదే చంద్రునుంచి మరల గ్రహంలోకి పోయి కుజుడు భర్త కారకుడు కుజుడు కాబట్టి జాతకుడు మిక్కిలి కోపవంతుడు అయ్యిఉంటాడు. మరియు అదే క్షేత్రంలో గురువు నీచకనుక ఆర్థిక స్థిరత్వంలో ఒడిదుడుకులు మనం గమనించవచ్చు.

ఈ విధంగా జాతకాన్ని ఒక్క గ్రహం ద్వారా పరిశీలించవచ్చు.

ఈ నాడు సమాజంలో శని భగవాని నుంచి, ఉద్యోగం, Foreign , ఆయుష్య ఇటువంటిది ఎన్నో మానవ ప్రసాదించే శని భగవానుడిని ఏలిన్నాటి శని అని పేరుతో ఈనాడు సమాజంలో ఒక చెడు ప్రచారం ఉన్నది. ఏలిన్నాటిశని అనగా చంద్రుని నుంచి శని భగవానుడు 1,2,12 ఇండ్లలో ఉండుట అని అర్థము. కాని ఇక్కడ మనం గుర్తించుకొనవలసిన విషయం ఏమనగా చంద్రుని నుంచి మాత్రం శనిభగవానుని చూచినను కాని మనము 7 గ్రహములనుంచి శనిభగవానుని చూచిన ఎన్నోమంచి విషయాలు, మరియు చెడు విషయాలు గ్రహించుకొనవచ్చు. మనకు తెలుస్తుంది. నేను ఇదే విధంగా కుజదోషం, నాగదోషం, వాస్తు మొదలగు అంశాలను ఈ గ్రంథం ద్వారా సమాజంలోని ప్రమాదాలను పోగొట్టుటకు ఈ నా మొదటి ప్రయత్నంను భగవంతుడు మరియు పాఠకులు అనుగ్రహించవలెనని ప్రార్థన.

(ఈ భృగునాడి పద్దతిలో జాతకమును రాశి చక్రంలోని రాశులను దిక్కులుగా విభజించి అందులో గ్రహాలను పొందుపరచి ఉదా: తూర్పు, దక్షిణం, పడమర, ఉత్తరం) జాతకమును నిర్మించుట జరుగుతుంది.

తూర్పు దక్షిణం పడమర

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉత్తరం | మీనం | మేషం | వృషభం | మిధునం | |
| పడమర | కుంభం | | | కర్కాటకం | ఉత్తరం |
| దక్షిణం | మకరం | | | సింహం | తూర్పు |
| తూర్పు | ధనుస్సు | వృశ్చికం | తుల | కన్య | దక్షిణం |

ఉత్తరం పడమర




**27 నక్షత్రములు తారాబలము చూచుకొనుటకు పద్ధతి**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | అశ్వని | 10. | మఘ | 19. | మూల | కేతువు | 1 |
| 2. | భరణి | 11. | పుబ్బ | 20. | పూర్వషాఢ | శుక్రుడు | 2 |
| 3 | కృత్తిక | 12. | ఉత్తర | 21. | ఉత్తరాషాడ | రవి | 3 |
| 4. | రోహిణి | 13. | హస్త | 22. | శ్రవణము | చంద్రుడు | 4 |
| 5 | మృగశిర | 14. | చిత్త | 23. ⟶ | ధనిష్ఠ | కుజుడు | 5 |
| 6. | ఆర్ద్ర | 15. | స్వాతి | 24. | శతభిషం | రాహువు | 6 |
| 7. | పునర్వసు | 16. | విశాఖ | 25. | పుర్వాభద్ర | గురువు | 7 |
| 8. | పుష్యమి | 17. | అనూరాధ | 26. | ఉత్తరాభద్ర | శని | 8 |
| 9. | ఆశ్లేష | 18. | జ్యేష్ఠ | 27. | రేవతి | బుధుడు | 9 |

ఏ నక్షత్రం అయినా 1,2,4,6,8,9 best (ఎవరికైనా) 1– (సాధారణం)

3,5,7 – bad (ఎవరికైనా)

**27 నక్షత్రములు – 12 రాశులకు సంబంధము**

| | | |
|---|---|---|
| అశ్వని భరణి కృత్తికా పాదము 1 | – | మేషం |
| కృతికాస్త్రయో రోహిణి మృగశిరార్ధం | – | వృషభం |
| మృగశిరార్ధం ఆర్ద్ర పునర్వసుస్త్రయః | – | మిధునం |
| పునర్వసుపాదో పుష్యమి ఆశ్లేషాంతం | – | కర్కాటకం |
| మఖ పుబ్బ ఉత్తరాషాడ | – | సింహం |
| ఉత్తరాస్త్రయో హస్త చిత్తర్ధం | – | కన్య |

| | | |
|---|---|---|
| చిత్తార్ధం స్వాతి విశాఖాస్త్రయః | - | తుల |
| విశాఖ పాదో అనూరాధ జ్యేష్ఠాంతక ః | - | వృశ్చికం |
| మూల పూర్వాషాడ ఉత్తరాషాఢ పాదః | - | ధనుస్సు |
| ఉత్తరాషాఢాస్త్రయో శ్రవణం, ధనిష్ఠార్ధం | - | మకరం |
| ధనిష్టార్ధం, శతభిషం, పూర్వాభద్రస్త్రయః | - | కుంభం |
| పూర్వాభాద్ర పాదో ఉత్తరాభాద్రా రేవత్యంతం | - | మీనం |

**ద్వాదశ రాశులు - అంగములు**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | మేషం | - | శిరస్సు | 7. | తుల | - | పొత్తికడుపు |
| 2. | వృషభం | - | ముఖము | 8. | వృశ్చికము | - | స్త్రీ, పురుష మర్మస్థానములు |
| 3. | మిధునం | - | బహువులు | 9. | ధనుస్సు | - | రెండు తొడలు |
| 4. | కర్కాటకం | - | వక్షము | 10. | కుంభము | - | రెండుమోకాళ్ళు |
| 5. | సింహం | - | హృదయం | 11. | మకరం | - | రెండు పిక్కలు |
| 6. | కన్య | - | ఉదరము | 12. | మీనం | - | పాదములు |

**చర, స్థిర, ద్విస్వభావ రాశులు**

1. మేష, కర్కాటక, తులా, మకరములు - చరరాశులు
2. వృషభ, సింహ, వృశ్చిక, కుంభములు - స్థిరరాశులు
3. మిధునం, కన్య, ధనస్సు, మీనములు - ద్విస్వభావ రాశులు

| **గ్రహములు** | | **స్వక్షేత్రములు** |
|---|---|---|
| సూర్యునకు | - | సింహము |
| చంద్రునకు | - | కర్కాటకము |
| కుజునకు | - | మేష, వృశ్చికములు |
| బుధునకు | - | మిధున, కన్యలు |
| గురునకు | - | ధనుస్సు, మీనము |
| శుక్రునకు | - | వృషభము, తుల |
| శనికి | - | మకరము, కుంభము |

**నవగ్రహములకు - ఉచ్ఛనీచలు**

| **గ్రహములు** | **ఉచ్ఛ** | **నీచ** |
|---|---|---|
| సూర్యునకు | మేషము | తుల |
| చంద్రునకు | వృషభము | వృశ్చికము |
| కుజునకు | మకరము | కర్కాటకము |

| | | |
|---|---|---|
| బుధునకు | కన్య | మీనము |
| గురునకు | కర్కాటకము | మకరము |
| శుక్రునకు | మీనము | కన్య |
| శనికి | తుల | మేషము |

**నవగ్రహములకు - మూల త్రికోణములు**

| గ్రహములు | మూల త్రికోణములు |
|---|---|
| సూర్యునకు | సింహము |
| చంద్రునకు | వృషభము |
| కుజునకు | మేషము |
| బుధునకు | కన్య |
| గురునకు | ధనుస్సు |
| శుక్రునకు | తుల |
| శనికి | కుంభము |

**నవగ్రహములకు - స్త్రీ, పురుష, నంపుసక నిరూపణ**

రవి, కుజ, గుర - పురుష గ్రహములు

చంద్ర శుక్రులు - స్త్రీ గ్రహములు

బుధ, శనులు - నపుంసక గ్రహములు

రాహు, కేతులు - కొందరు స్త్రీ గ్రహములని

మరికొంత మంది ప్లేచ్య గ్రహములు అని అంటారు.

| గ్రహం | రాశి | నక్షత్రం | మూలత్రికణ | ఉచ్ఛ | పు॥భ | నీచ | పరమనీచ |
|---|---|---|---|---|---|---|---|
| రవి | సింహం | 1-20 | 21-30 | మేషం | 10 | తుల | 10 |
| చంద్ర | వృషభం | 1-3 | 4-30 | వృషభం | 3 | వృశ్చికం | 3 |
| కుజ | మేషం | 1-18 | 19-30 | మకరం | 28 | కర్కాటకం | 28 |
| బుధ | కన్య | 1-15 | 16-30 | కన్య | 15 | మీనం | 15 |
| గురు | ధనస్సు | 1-10 | 11-30 | కర్కాటకం | 5 | మకరం | 5 |
| శుక్ర | తుల | 1-15 | 16-30 | మీనం | 26 | కన్య | 36 |
| శని | కుంభం | 1-20 | 21-30 | తుల | 20 | మేషం | 20 |

బుధునకు, స్వక్షేత్రం, ఉచ్ఛ, మూల త్రికోణము కూడ కన్యమే, రాహు, కేతువులు చాయాగ్రహాలు

## నవగ్రహములు - దృష్టిలు

భృగునాడి పద్ధతిలో రవి నుండి సప్తగ్రహములు 1,5,7,9 దృష్టిలో ప్రతి గ్రహము మరొక గ్రహమును చూచు, రాహు, కేతువులకు 1,5,9 దృష్టి మాత్రం ఉండును.

**నవగ్రహముల మిత్రులు - శత్రువులు - సములు**

| గ్రహ | మిత్రులు | సముడు | శత్రువులు |
|---|---|---|---|
| రవి | చంద్ర, గురు, కుజుడు | బుధుడు | శని, శుక్రు, రా, కే |
| చంద్ర | అందరికి మిత్రమముగా కనపడే శత్రువు | | |
| కుజ | రవి, గురు | కుజు | శని, బుధ, శుక్ర, చంద్ర, రాహు |
| బుధుడు | రవి, శుక్ర, శని | రాహు, గురు | చంద్ర, కేతు, కుజ |
| గురు | రవి, చంద్ర,కుజ | శని, కుజ,కేతు | శుక్ర, రవి |
| శుక్ర | శని, బుధ, రాహు | గురు | కుజు, రవి, చంద్ర, కేతు |
| శని | శుక్ర, బుధ,రాహు | గురు | రవి, చంద్ర, కుజ, కేతు |
| రాహు | శని, బుధ, శుక్ర | | కుజ, రవి, చంద్ర, కుజ గురు |
| కేతువు | శని, గురు, కుజ | | చంద్ర, బుధ, శుక్ర, శని, రాహు |

**నవగ్రహములు - వర్ణములు**

| | | |
|---|---|---|
| గురువు, శుక్ర | - | బ్రాహ్మణులు |
| రవి, కుజులు | - | క్షత్రియులు |
| చంద్ర, బుధ | - | వైశ్యులు |
| శని | - | శూద్రులు |
| రాహు, కుజ | - | మ్లేచ్ఛులు |

**నవగ్రహముల - గుణములు**

| | | |
|---|---|---|
| శుక్ర, చంద్ర, గురు | - | సత్వగుణం |
| రవి, బుధ | - | రజోగుణం |
| శని, కుజ, రాహు | - | తమోగుణం |
| కేతు | - | సత్వగుణం |

**నవగ్రహములు - రంగులు**

| | | |
|---|---|---|
| శని | - | నలుపు |
| చంద్ర | - | తెలుపు |
| కుజ | - | ఎరుపు |

| | | |
|---|---|---|
| బుధ | – | పచ్చ |
| గురువు | – | పసుపు |
| శుక్ర | – | తెలుపు |
| శని | – | నీలం, నలుపు |
| రాహువు | – | గోమేధికం |
| కేతువు | – | పసుపు |

**నవగ్రహములు – దిక్కులు**

| | | | |
|---|---|---|---|
| రవి | – | తూర్పు | |
| చంద్ర | – | వాయువ్యం | |
| కుజ | – | దక్షిణం | |
| బుధ | – | ఉత్తరం | గురువు |
| కేతువు | – | ఈశాన్యం | |
| శుక్ర | – | ఆగ్నేయం | |
| శని | – | పడమర | |
| రాహువు | – | నైరుతి | |

**గ్రహయుద్ధం**

ఒకేరాశిలో కుజునితో కలసి గురు, శుక్ర, బుధ, శనులు ఎవరున్నను గ్రహ యుద్ధంగా అనబడును. కుజును దాటిన గ్రహం కుజుపై గెలుపుపొందిన గ్రహం. కుజుని గ్రహలుదాటనివి పరాజయం గ్రహం చెప్పవచ్చు.

**గ్రహములు – వక్రత్వం**

ఏదైనా గ్రహము సంచారమున ముందుకు పోవలసిన గ్రహం ముందునకు పోకుండా వెనుకకు వచ్చును. అట్టి స్థితిని వక్రస్థితి అనబడును. రవి, చంద్రులకు, వక్రం లేదు. రాహు, కేతువులు ఎప్పుడు వక్రంగా సంచరించి, వక్రత్వం పొందిన గ్రహములు అనగా, శని, బుధ,కుజ, గురు శుక్రులకు వక్రత్వం వర్తించును.

**పంచ మహా పురుష యోగములు**

**రుచిక యోగము**

కుజుడు జన్మలగ్నము లగాయితు కేంద్రములో ఉండి, ఆ స్థానము కుజునకు స్వక్షేత్రముగాని, ఉచ్ఛగాని, అయినచో, అది రుచికయోగమని చెప్పబడినది. ఈ యోగమున జన్మించినవారు ఉన్నత పదవులలో ఉండి, అధికారులుగ ఉందురు. ధనము, కీర్తి సంఘజీవితములో గౌరవము, ప్రజాధికారము గలవాడుగను ఉందురు. వీరు తరచుగ సైన్యము, పోలీసుశాఖలలోగాని, ఇంజనీరింగు శాఖలలోగాని ఉందురు. కొందరు వైద్యవృత్తి అవలంభించి శస్త్రచికిత్స చేయుటలో నేర్పరులుగ ఉందురు.

కొన్ని జ్యోతిషశాస్త్ర గ్రంథములలో దశమే అంగారకోనాస్తిజాతకం ప్రయోజనః అని చెప్పబడి ఉన్నది.

**23 ద్వాదశ భావాల నుండి తెలుసుకోదగ్గ విషయాలు మిగిలిన వివరాలు పరిశీలించండి.**

**మొదటిభావము :-**

దీనినే తనూభావము అంటారు. శరీరం, అవయములు,సుఖాసుఖములు, వృద్ధాప్యము, జ్ఞానము, జన్మస్థానము, కీర్తి, కలలు, బలము, ఠీవి, రాజనీతి, ఆయువు, మనశ్శాంతి వయస్సు, వారసులు, పోలికలు, జీవనోపాయము, అపకీర్తి, గౌరవము, చర్మము, నిద్ర, నిపుణత్వము, ఇతరులను తక్కువ చేయు స్వభావము, రోగవిముక్తి, అసంతృప్తి, పశుసంరక్షణ, వంశధూషణ, ఆరోగ్యము ఇవి తనూలేదా మొదటి భావసంజ్ఞలు.

**ద్వితీయ భావము :-**

ఉపన్యాసము, ఐశ్వర్యము, పూర్వాచారము, పరోపకారము, గోళ్ళు, భోగము, సత్యాసత్యములు, వాక్కు నాలుక, నేత్రములు, దుస్తులు, వజ్రము, రాగి మణులు, స్థిర స్వభావము, సుగంధ ద్రవ్యములు, కుటుంబము, వ్యాపారము, ఔదార్యము, ఆర్జన, స్నేహము, కోమలత్వము, స్నేహితులు, వాగ్ధాటి, పాండిత్యము, బంగారము, ధనధాన్యము, వినయము, నాసిక, మానసిక స్థిరత్వము, దాతృత్వము, జీవనోపాయము, దక్షిణనేత్రము, ముఖము, మారకము భోజనము, విద్య.

**తృతీయభావము :-**

పరాక్రమము, కనిష్టసోదరీలు, యుద్ధము, చెవులు, కాళ్ళు, చిత్త చాంచల్యము, సామర్థము, సర్వసౌఖ్యము, విచారము, కలలు, రౌద్రము, స్వబంధువులు, మిత్రులు, స్వల్ప ప్రయాణములు మృష్టాన్న భోజనము, ఆస్తి విభజన, ఆభరణములు సత్ప్రవర్తన, పాండిత్యము, గతము, శారీరకబలము, లాభము, శారీరక పుష్టి, సంపన్నజన్మ దాసదాసీలు, వాహన సౌఖ్యము, కార్య భారము వహించుట, వర్ణాశ్రమ ధర్మము, గురువులు పెద్దలు, కోపము, శాంతము, ఉపాయము, కార్యసంధానము.

**చతుర్ధభావము :-**

విద్య, రాజ్యము, గ్రహము, ప్రయాణము, పల్లకి, రిక్షా, చిన్నపీడలు, అభ్యంగస్నానము, తల్లిబంధువులు స్నేహితులు, కలము, దుస్తులు, చెరువులు, నూతులు, నీరు, పాలు, సుగంధము, సుఖజీవనము, సత్కీర్తి, దివ్యౌషధము, విశ్వాసము, అబద్ధములు, మంటపము, విజయము, కష్టార్జితము, భూమి, ప్రతిష్టించుట, మాతృవర్గము, తండ్రిఔన్నత్యము, స్వార్ధ ఆదాయము, గృహములు, గృహప్రవేశము, శీలము, సాధన, భ్రంశము, పిత్రార్జితము, దేవతా ప్రసాదము, గుప్తస్థాన పరిశోధన, వేదశాస్త్ర అభివృద్ధి, గోవులు, సస్యవృద్ధి, నిధి నిక్షేపములు, గ్రంథము, నుయ్యి.

**పంచమము :-**

సంతానము, తండ్రిచేసిన పుణ్యము, శిల్పవిద్య, మనస్సు విద్య, గర్భము, వివేకము, ఛత్రము, సత్యధాపఠనము, శుభలేఖలు, దుస్తులు, కోరికలు సిద్ధింప చేసుకొనుట, పితృధనము, దూరదృష్టి స్త్రీ మూలక భాగ్యము, వేశ్యాస్త్రీ సంభోగము, గౌరవము, రహస్య నిధి, వినయము, వార్తాలేఖనము, క్షేమము, గ్రంధరచన కార్యాచరణము,

మంత్రోపాసన, వైభవము, అన్న ప్రదానము, పాపపుణ్యములు, తారతమ్యములు, మంత్రజపము, ప్రతిభ, సరి అయిన ఆలోచన మృందంగాది సంగీత వాద్యములు, సంతృప్తి, పాండిత్యము వంశపారంపర్య అధికారము మొ.నవి.

**షష్టభావము :-**

రోగము, విఘ్నము, యుద్ధప్రాప్తి, మేనమామలు, కంతులు, క్రూరకార్యాచరణ, ఉన్మాదము, స్ఫోటకము, శత్రుత్వము, వైరము, లోభత్వము, చిత్తక్లేశము, బహువిచారము, బహుజనధైర్యము, యాచకత్వము, అకాలభోజనము, పతనము, లాభము అధికశ్రమ, విషమ, అతిశూల, వణుకు, స్వకీర్తి, సంరక్షణ, అతిసారము, మూత్రవ్యాధి, షడ్రసములు, నింద, సేవ, చౌర్యము, విపత్తు, కారాగృహము, సోదరులలో కలహము.

**సప్తమ భావము :-**

వివాహము, వ్యభిచారము, ప్రేమించబడుట, జారస్త్రీకలహము, క్రమముతప్పుట, సుగంధ కుసుమములు, పానీయము, మృష్టాన్నము, తాంబూలము, ప్రయాణభంగము, పెరుగు, బుద్ధిమాంధ్యము, వస్త్రాలంకార ప్రాప్తి, తేజస్సు, ద్వికళత్రము, మర్మస్థానము, మూత్రము, గుదప్రదేశము, వ్యాపారము, మధురపానియము, తేనె, పులసు, ఆజ్యము, భోజనము, దాతృత్వము, శక్తిపాడగుట, శతృవులను జయించుట, సాధనాంతర ధనము పొందుట, వాద ప్రతివాదన, సంభోగము, దత్తపుత్రుడు, నేతి పదార్ధములు తినుట, విదేశ ప్రయాణం, భార్య, స్త్రీ సౌఖ్యము, చోరత్వము.

**అష్టమభావము :-**

ఆయువు, సుఖము, పరాభవము, మృతధనము, భాదలతో కూడిన ముఖము మరణము, ఆపద, కలహము, సోదర శతృవు, విరోధి అనియము, దుఃఖము, సోమరితనము రాజదండన భావము, డబ్బులు పోవుట, ఋణము తెలియకుండా పరుల ధనము పొందుట, దుర్మార్గము, పాపము, జీవహింస, అంగహీనము, శిరచ్ఛేదము, విపరీత దుఃఖము, బుద్ధిని పాడుచేయు కధలు వినుట, దురదృష్టము, పాడుపనులు చేయుటలో అధిక శ్రద్ధ, యుద్ధము, మానసిక చాంచల్యము.

**నవముభావము :-**

దానము, ధర్మము, తీర్ధయాత్రయులు సేవించుట, గురువులు, హరియందు భక్తి, ఔషధము ఆచారము చిత్తశుద్ధి, దేవతారాధన, విద్య నేర్చుకొనుటలో శ్రద్ధ, వైభవము, ప్రయాణము లేక వాహనము, భాగ్యము, ప్రలాపము, ఆచరణ పద్ధతులు, నీతులు, సత్కథలు, యాత్ర, అభిషేకము, సజ్జన సాంగత్యము, సర్వసౌక్యము, పిత్రార్జన, పుత్రులు, పుత్రికలు అష్టైశ్వర్యములు, అశ్వవాహనము, గజవాహనము, పట్టాభిషేకమందిరము, బ్రాహ్మణపూజ, వైదిక క్రతువులు, ధన వ్యాపారము, మొ॥నవి.

**దశమ భావము :-**

వర్తకము, రాజ సన్మానము, అశ్వగమనము, శరీర వ్యాయామము, రాచకార్యము, వ్యాపారము, భూతదయ శ్రేష్ఠత్వము, గురువు, యంత్రము, యాంత్రికము, మాతృదేవత, పుణ్యము, స్థానము, దేవతలు, మంత్రసిద్ధి, వైభవము, మంచిమందులు, దత్తపుత్రుడు, రాజు, మార్గము, మానము, సుఖజీవనము, ప్రఖ్యాతి, కీర్తి, విచక్షణాధి కారము, బోధనము, రాజముద్ర, ప్రాభవము, నిగ్రహము, అపకారము, అజ్ఞలు యిచ్చుట, కర్మ.

**ఏకాదశ భావము :**

సర్వ విధలాభము, దురాశ, విపరీతమైన కోరిక, వివిధ ఆదాయములు, పరాధీనం, జ్యేష్ఠ సోదరసోదరీలు, విగ్రహారాధన పినతండ్రులు, పెదతండ్రులు, ఉపాసన, విద్య, సువర్ణ సంగ్రహము, పటుత్వము, మొకాళ్ళు, ఖ్యాతివంతమైన స్థలము, భూషణముల యందు ప్రీతి, రాజధనము, నష్ట ద్రవ్యము, స్త్రీలు కోరు వస్తువులు చేయించుట, మంత్రి పదవి, బావమరిది, లబ్ధి, భాగ్యోదయము, ఇష్ట కార్యము, సక్రమ లాభము, ఆశ, తల్లి, ఆయుర్దాయము, చెలి పిక్కలు, చిత్ర లేఖనము, బొమ్మలు వేయుట, కళానైపుణ్యము.

**ద్వాదశ భావము :-**

నిద్రాభంగము, మనోవ్యధ, రెండుకాళ్ళు, శత్రుభయము, బంధనము, చెర, బాధావిముక్తి, ఋణవిముక్తి, ఋణ విమోచన, ఏనుగులు, గుఱ్ఱములు, శత్రువు.

స్వర్గారోహణము, ఎడమకన్ను, ప్రజావిరోధము, అంగవైకల్యము, స్త్రీలోలత్వము, వివాహము చేయుట, శయ్యాత్యాగము, అధికారము తగ్గుట, శతృకారాగారము, మనోవికలత్వము, దైన్యస్వభావము ఆసక్తి, వాదప్రతివాదములు, రోషము, దేహపీడ, మారకము, విదేశగమనము, ధనవ్యయము, కళత్రహాని మొ॥నవి.

**శని :** ఈశ్వరుడు , గడ్డము, ముని, నిదానము, సోమరి, అన్న, నమ్మకమైన సేవకుడు, మోకాళ్ళు, కార్మకారకుడు, సోమరి, నరాలబలహీనత, జాయింట్లు, మోకాళ్ళు నొప్పులు, కఫము మరియు వాతము, భోజనాలగది, హోమము, నీలము, అరుగుదల, సంసారము, పంచమము.

**రాహువు :** ఇంటిపెద్ద, నోరు, చక్రం, రాక్షసులకు ప్రతీక, పితామహుడు, రాక్షసులమామ, ముస్లిం, మోహం, ఖాళీ, విదేశీ, సర్వీసు వాతము,ద్వారము, వస్తువులు దాచి ఉంచు ప్రదేశం, గోమేధికం, కంప్యూటర్లు, చక్రము

**కేతు :** చిన్న వెంట్రుక, యోగి , పవిత్రత, క్రిష్టమస్, వివాదం, స్వేచ్ఛ, మోక్షం, విషం, మహాత్మ, దారం, వైఢూర్యం కాలవ, ఇరుకుదైన ప్రదేశం, బ్రహ్మ, గాయములు, వైద్యం, వృత్తిలో ఆటంకములు.

**పరివర్తన యోగం :** భ చక్రంలోని గ్రహం తమదైన క్షేత్రంలో కాక వేరొక గ్రహం యొక్క క్షేత్రంలో ఉండి, అదేవిధంగా మరొక గ్రహం తన స్వక్షేత్రం కాకుండా వేరొక గ్రహం స్వక్షేత్రంలో ఉండుట వలన రెండు గ్రహాలు యొక్క పరిస్థితి ఒకరి ఇంటికి వారు తాము‌న్న క్షేత్రంలోకి రావడం జరుగును. దీనిని పరివర్తన యోగం అందురు.

| | | | |
|---|---|---|---|
| | | | |
| | | | శని |
| చంద్ర | | | |
| | | | |

ఇందులో రెండు గ్రహాలు అనగా శని, చంద్రుని ఇంటిని, చంద్రుడు శని ఇంటిని ఉండుట వలన ఈ రెండు గ్రహాలు పరివర్తనయోగం కావించి శని తన స్వక్షేత్రంకు, చంద్రుడు తన క్షేత్రంకు మార్పు చెందును.

## హోరా కాలము

పరాశర పద్ధతిలో వృశ్చికుడు అనగా ప్రశ్నించు వ్యక్తి సమయమును ఆధారముగా చేసుకొన్న లగ్నమును భచక్రములో నిర్మించి జాతకమును వివరించుట జరుగుతుంది.

ఇదే విధముగా భృగునాడి పద్ధతిలో ప్రశ్నించు వ్యక్తి ఆ రోజు యొక్కగ్రహాదిపతి సమయమునకు అధిపతి ఇతర గ్రహాల వీక్షణ మొదలైనగు విషయాల ద్వారా జాతకాన్ని వివరించుట జరుగుతున్నది. అదే సమయంలో ముగ్గురు వ్యక్తులు ప్రశ్నవేసిన్నప్పుడు మొదట వ్యక్తికి ఆరోజు ఏ సమయంలో ప్రశ్నించాడో ఆ సమయానికి అధిపతిన్ని ఆ అధిపతి అయిన గ్రహం నుంచి 5వ గ్రహానికి లగ్నాన్ని నిర్మించి రెండవ వ్యక్తి యొక్క ప్రశ్నకు జవాబుని, మూడవవ్యక్తికి 9వ గ్రహాన్ని లగ్నంగా నర్మించి మూడవ వ్యక్తి యొక్క ప్రశ్నకు సమాధానము చెప్పబడుతుంది.

**ఉదా :** ఒక వ్యక్తి గురువారం సాయంత్రం 7గం॥ 30ని లకు ప్రశ్నవేస్తే అప్పుడు మనం భ చక్రంలోగురువును లగ్నంగా భావించి ఫలితము చెప్పవచ్చు. అదేరోజు సాయంత్రం 7గం॥ 31ని లకు మరొక ప్రశ్న వేసినప్పుడు మనం గురు గ్రహాన్ని కాక, గురువు నుంచి 5వ గ్రహాన్ని అయినా బుధుడికి లగ్నంగా భావించి చెప్పవచ్చు.

మూడవ వ్యక్తి అదేరోజు సాయంత్రం 7 గంటల 35 నిలకు సంధించినప్పుడు మనం గురువు నుంచి 9వ గ్రహాన్ని శుక్రుని లగ్నంగా భావించి ఫలితాన్ని చెప్పడం జరుగుతుంది.

ఒక వ్యక్తికి జననం, సమయం ప్రదేశం మొదలైన వాటిగురించి తెలియనప్పుడు దైవజ్ఞుడైన జ్యోతిష్యుడు దగ్గరకు వచ్చి గురువుగా భావించి వచ్చిన వృశ్చకునకు జ్యోతిష్యుడు బ్రహ్మవిద్య అయినా జ్యోతిష్యం ద్వారా (పంచమ వేదం) జాతకాన్ని వివరించడం జరుగుత్నుది.

### హోరాసూత్రములు :

1. ఒక వ్యక్తి వచ్చిన కాలమును సూచించు హోర అధిపతిని లగ్నంగా భావించాలి. హోరా అధిపతికి ఇరువైపుల అనగా 2,12 లలో శుభ, అశుభ గ్రహములను చూచి ఫలితం నిర్ధారించాలి. హోరా అధిపతి తరువాత క్షేత్రం తనకు మిత్ర గ్రహం అయిన ప్రశ్నను అడిగిన వ్యక్తి పని తొందరగా నెరవేరును.
2. జాతకములో /హోరాకాలములో రాహు, కేతువులకు స్త్రీ గ్రహములు అయిన బుధ, శుక్రునకు, చంద్రునకు మిక్కిలి ప్రాధాన్యత కలదు.
3. ప్రశ్నను సూచించు హోరాధిపతి 2,5,7,9 హోరాధిపతులకు మిత్రుడు లేదా శత్రువా అను విషయం కూడా పరిగణించాలి.
4. హోరాధిపతి అస్తంగత్వం చెందినాడా లేదా మిగిలిన గ్రహాలతో కలిసి ఉన్నాడు వాటి బలంను కూడా పరిగణలోకి తీసుకోవాలి.
5. హోరాధిపతి తనకు శత్రువు అయినటువంటి గ్రహాలు కలయిక వలన బలంను కొంత కోల్పోవును.
6. హోరాధిపతి ఉచ్చలో ఉండి తనకు శత్రువులు అయిన గ్రహాలతో కలయిక వలన తాను తలపెట్టిన పనిని అమిత కష్టముతో నెరవేర్చును.

7. హోరాధిపతి తనకు మిత్రుడు, మరియు శత్రువులతో కలసినపుడు జాతకుడు పనిని పూర్తిచేసి అపనిందలు పాలు అగును.

8. చంద్రునికి పరిగణించే టపుడు అమావాస్య చంద్రుడు (కృష్ణపక్షం), పౌర్ణమిచంద్రుడు (శుక్లపక్షం) అని పరిశీలించాలి. అమావాస్య చంద్రుడు, బలహీనంగాను, పౌర్ణమి చంద్రుడు బలంగా ఉండును.

9. ఒకే సమయంలో ముగ్గురు ప్రశ్నవేసినపుడు మొదటివాని ప్రశ్నను ఆసమయం హోరాధిపతిగాను, రెండవ వాని సమయమందు హోరాధిపతి నుంచి 5వ హోరాధిపతి రెండవ వ్యక్తి ప్రశ్నాధిపతిగాను, మూడవవ్యక్తి ప్రశ్నకు మొదట హోరాధిపతి యొక్క 9వ హోరాధిపతి మూడవవ్యక్తి ప్రశ్నకు అధిపతిగా నిర్ణయించాలి.

10. హోరా అధిపతి ఉంటున్న రాశియొక్క కారకత్వములు కూడా మనం పరిశీలించవలెను.

11. 2,11 అధిపతులను కూడా మనం పరిగణనలోకి తీసుకొనవలెను.

12. మనం ప్రశ్న లగ్నం ను వేయునపుడు ప్రశ్న అడిగిన వ్యక్తి అడిగిన సమయం, అందులో రాహుకాలం కాని గుళిక కాలం ఉన్నచో ప్రశ్న హోరాధిపతికి రాహువుకు గల మిత్ర / శత్రు సంబంధం చాలా ముఖ్యమైనది.

13. హోరా లగ్నాధిపతి పరివర్తనయోగంలో ఉన్నదా, వక్రంలో ఉన్నదా, గ్రహయుద్ధంలో ఉన్నదా అను విషయంను పరిగణనలోకి తీసుకొనవలెను.

14. హోరా అధిపతి చాలా గ్రహములతో కలసినపుడు హోరా అధిపతికి, మిగిలిన గ్రహముల డిగ్రీలను మనం పరిగణనలోకి తీసుకొనవలెను.

ఉదాహరణ జాతకం

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| శని | 17-Sep-1950 | | చంద్ర |
| | | | రవి, శుక్ర బుధ |
| | గు | రా | కుజు |

పై జాతకంలో ఒక వ్యక్తి గురువు హోరాలలో ప్రశ్న వేసినపుడు గురువు నుంచి మనం, 2,7,5,9 రాశులలో చూచిన 2,5,7 రాశులు గ్రహాలు లేవు. 9వ రాశిలో చంద్రుడు ఉన్నాడు. అనగా చంద్రుడు ప్రమాదాలకు సంబంధించినవాడు. కావున వచ్చిన వ్యక్తి ప్రమాదాలకు సంబంధించిన ప్రశ్న వేసినాడు అని చెప్పవచ్చు.

ఈ క్రింది పట్టిక ద్వారా హోరాకాలాన్ని విశదీకరణ చూడవచ్చు.

| A.M | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని | P.M | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 6–7 | రవి | చంద్ర | కుజు | బుధ | గురు | శుక్ర | శని | 6–7 | గురు | శుక్ర | శని | రవి | చంద్ర | కుజు | బుధ |
| 7–8 | శుక్ర | శని | రవి | చంద్ర | కుజుడు | బుధ | గురువు | 7–8 | కుజ | బుధ | గురు | శుక్ర | శని | రవి | చంద్ర |
| 8–9 | బుధ | గురువు | శుక్ర | శని | రవి | చంద్ర | కుజుడు | 8–9 | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
| 9–10 | చంద్ర | కుజుడు | బుధ | గురువు | శుక్ర | శని | రవి | 9–10 | శుక్ర | శని | రవి | చంద్ర | కుజ | బుధ | గురు |
| 10–11 | శని | రవి | చంద్ర | కుజుడు | బుధ | గురు | శుక్ర | 10–11 | బుధ | గురు | శుక్ర | శని | రవి | చంద్ర | కుజ |
| 11–12 | గురు | శుక్ర | శని | రవి | చంద్ర | కుజ | బుధ | 11–12 | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని | రవి |
| 12–1 | కుజ | బుధ | గురు | శుక్ర | శని | రవి | చంద్ర | 12–1 | శని | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర |
| 1–2 | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని | 1–2 | గురు | శుక్ర | శని | రవి | చంద్ర | కుజ | బుధ |
| 2–3 | శుక్ర | శని | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | 2–3 | కుజ | బుధ | గురు | శుక్ర | శని | రవి | చంద్ర |
| 3–4 | బుధ | గురు | శుక్ర | శని | రవి | చంద్ర | కుజ | 3–4 | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
| 4–5 | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని | రవి | 4–5 | శుక్ర | శని | రవి | చంద్ర | కుజ | బుధ | గురు |
| 5–6 | శని | రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | 5–6 | బుధ | గుర | శుక్ర | శని | రవి | చంద్ర | కుజు |

# గోచారం

గోచారం అనగా గో అంటే గ్రహము, చారము అనగా చలించుట అని అర్థము. ప్రతి గ్రహమునకు కక్షలు ఉండును. అవి క్రింద వివరించబడును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రవి | – | 1నెల | కుజుడు | – | 43 రోజులు |
| బుధుడు | – | 1 నెల | గురువు | – | 1 సం॥ |
| శుక్రుడు | – | 1 నెల | రాహువు | – | 1½ సం॥ |
| చంద్రుడు | – | 2 ½ రోజు | కేతువు | – | 1½ సం॥ |
| శని | – | 2½ సం॥ | | | |

రవి గ్రహం గోచారంలో జాతకంలో అనగా భ చక్రంలో అది ఇతర గ్రహాల మీద సంచరించినపుడు

**రవి :** విజయం, కీర్తి ప్రతిష్టలు, అధికారులలో సత్‌సంబంధాలు.

**చంద్రుడు :** తండ్రికి మరియు కుమారునికి ఎక్కువ ప్రయాణాలు, చంద్రుడు నీలాపనిందలు పొందిన వాడు కావున అదే ఫలితములు వర్తించును.

**కుజుడు :** రక్తమునకు సంభంధించిన దోషాలు, సోదరులకు అడ్డంకులు, సమస్యలను సామరస్యంతో పరిష్కరించకునే అవకాశం.

**బుధుడు :** భూమి ద్వారా తండ్రి సంపాదన, వ్యాపారంలో విజయం, మిత్రుల కలయిక, నూతన ఆలోచనలు, పరువు ప్రతిష్ఠ, సమాజంలోని పేరుగల వ్యక్తులతో కలయిక.

**శని :** నమ్మకం కోల్పోవుట, పని జాప్యం, ఒత్తిడి, ఆర్థిక ఇబ్బందులు, నీలాపనిందలు.

**రాహువు :** షేర్లలో లాభం, తండ్రికి సోమరితనం అలవాటగుట

**కేతువు:** పిల్లల వల్ల ఇబ్బంది, తండ్రి దైవసంభంధం అయిన ఆలోచనలు

**1. కుజుడు :** కుజగ్రహం జాతక చక్రంలో గ్రహముల మీద సంచరించునపుడు వచ్చు ఫలితం.

**రవి :** గర్వం, మూర్ఖతనం, మానసికఒత్తిడి, శత్రువుల వలపనిలో ఒత్తిడి, బిడ్డకు ఇబ్బంది, తండ్రికి శత్రువుల వలన ఆటంకం.

**చంద్రుడు :** నిందపాటు, తల్లికి అనారోగ్య సూచనలు, స్థిరమైన ఆలోచనలు లేకపోవుట, సోదరునికి ఎక్కువ ప్రమాదాలు.

**కుజుడు :** ప్రమాదాలు, ఎక్కువగా శరీరంలో శక్తి కలుగుట

**బుధుడు :** శత్రువుల వలన ఇబ్బందులు, విశ్రాంతి లేకపోవుట, మనశ్శాంతి లేకపోవుట, భర్త, బంధువులలో మరియు మైత్రులతో కలహాలు.

**గురువు :** రక్తములో మార్పులు భారి ఒత్తిడి, అగ్ని నుంచి ప్రమాదం, మూర్ఛరోగం, తొందరపాటు, వృత్తిలో ఇబ్బందులు, శత్రువులతో ఇబ్బంది, భర్తకు మార్పులు, మంచి స్థితి గౌరవం.

**శుక్రుడు :** భర్తకు అన్ని విధముల ఆదాయం, బయట నుంచి వచ్చుట, బంధువులు, మిత్రులు, ఆడవారిలో కలయికలు.

**శని :** వృత్తిలో ఇబ్బందులు, ప్రమాదాలు మరియు ఉన్నవి పోగొట్టుకొనుట.

**రాహువు :** అతికామం, సోదరునికి వ్రాతపని

**కేతు :** అధికారం కోసం ప్రాకులాడుట.

**బుధుడు :** జాతక చక్రంలో బుధుడు గోచారంలో సంచరించుట వలన ఇతర గ్రహాల పై ఏర్పడు ప్రభావం.

**రవి :** తండ్రికి సహాయంచేకూరుట, తండ్రికి భూముల ద్వారా ఆదాయం పొందుట.

**చంద్రుడు:** కళాత్మకం గా లాభం, నిందలు, నిరాకరణ, ప్రయాణం.

**కుజుడు :** మిత్రులు మరియు సోదరుల మధ్య వివాదం,బంధువులు మరియు సోదరుల భూములలో వివాదాలు, భర్త, తన యొక్క స్నేహితులని కలుసుకొనుట.

**బుధుడు :** అన్నింటా సంబందాలు అనుకూలంగ ఉండుట, సమస్యలను చక్కగా పరిష్కరించుకొనుట.

**గురువు :** గురువు ద్వారా ఆదాయం, వివేకం, విజ్ఞానం, పేరుగల వ్యక్తుల కలయిక, ఆడవారు తమ భర్తకన్న ఎక్కువ వేరే వ్యక్తులను అభిమానించుట, చిన్నవారికి బయట వ్యక్తుల నుంచి సహకారం.

**శుక్రుడు :** భూముల ద్వారా ధనాదాయం, ఇంటి ద్వారా ధనాదాయం, సుఖం, సంతోషం, మంచి వార్తలు.

**శని :** వ్యాపార పరంగా ఆదాయము, మంచి ఫలితాలు, భూముల ద్వారా మిత్రుల ద్వారా ఆదాయాలు, సోమరితనం.

**రాహువు :** మంచి చతురత, హక్కు, సోదర సమానులకు అనారోగ్యం.

**కేతువు :** విద్యలో ఆటకం, భూముల వివరాలు, మంచి సమయం కాదు.

**2. జాతక చక్రములో వివిధ గ్రహాల మీద గోచారంలో చంద్రుడు ప్రవేశించినప్పుడు వచ్చు ఫలితాలు :**

**రవి :** తండ్రికి అవమానాలు మరియు ఆదాయం తరచు ప్రయాణాలు, తల్లికి ఆత్మస్థైర్యం చేకూరుట మరియు సరిఅయిన నిర్ణయం తీసుకొనలేకపోవుట.

**చంద్రుడు :** ప్రయాణాలు అధికం, స్త్రీలతో కలయిక, తల్లికి అపవాదం.

**కుజుడు :** సోదరునకు తరచు ప్రయాణాలు మరియు జాతకునికి రక్తమునకు సంబంధించిన ఇబ్బందులు, మానసిక ఒత్తిడి తొందరపాటు, నిర్ణయం తీసుకొనలేకపోవుట, తల్లికి అనారోగ్యం, చెడు వ్యక్తులతో పరిచయాలు.

**బుధుడు :** మిత్రుల వలన, బంధువుల వలన, కనిష్ట సోదరులు వలన, మామగారి వలన, బావమరిది వలన, భూమికి సంబంధించిన వాటికి అపనిందలు రావుట స్నేహితురాలైన స్త్రీల వల్ల చికాకులు కళాత్మకమైన ఆలోచనలు మనస్సులో రావుట.

**గురువు:** ఇల్లు వదిలి వేరే ప్రదేశమునకు పోవుట, కనిపించని శత్రువులతో పోరాడుట, తల్లికి దైవభక్తి. జలుబు, దగ్గు వల్ల అనారోగ్యము.

**శుక్రుడు :** భార్యకు అనారోగ్యము, మానసిక అశాంతి, అనవసరపు ఖర్చులు నియంత్రించుకోలేకపోటం ఇదే సంఘటనలు, జాతకుని అక్కకు, కుమార్తె, కోడలు మొదలైన వారికి పై సంఘటలను తరచూ చూడవచ్చును.

**శని :** వృత్తిలో బదిలీలు మరియు అవమానకరమైన పరిస్థితులు అన్నగారికి తరచు ప్రయాణాలు. తల్లిగారికి కాళ్ళకు సంబంధించిన ఇబ్బందులు.

**రాహువు :** తల్లిగారు మానసిక స్థితి ఇబ్బందికి గురి కావడం, జాతకునికి ప్రయాణాలు వల్ల కొత్త వ్యక్తులతో పరిచయాలు ఏర్పడి తద్వారా లాభించడం జరుగుతుంది.

C: (బుధ గ్రహం గురించి పాతకులు విద్యకు సంబంధించిన విభాగంలో చర్చించి ఉన్నాను).

**కేతువు :** దైవ చింతన, పవిత్ర నదీ స్నానాలు, తల్లిగారికి ఆరోగ్యం దెబ్బతిన్నడం.

**3. గురువు గ్రహం గోచారంగా జాతక చక్రంలో వివిధ గ్రహాల మీద సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు:–**

**రవి :** పేరు ప్రఖ్యాతలు ఉన్నత వ్యక్తులతో పరిచయాలు, మంచి నీడ ఉన్న వ్యక్తుల ద్వారా సహకారం, జాతకుని కీర్తి ప్రతిష్టలు సమాజంలో వ్యాపించుట.

**చంద్రుడు :** స్త్రీలతో పరిచయాలు, హఠాత్తు ప్రయాణాలు, తత్ద్వారా ఆదాయం వచ్చు అవకాశం.

**కుజుడు :** రక్త సంబంధీకులతో కలయిక వొత్తిడి వల్లన బి.పి. ఎక్కువ అవడం. మొండితనం, తొందరాపాటు, చిన్న చిన్న తప్పిదాలు వల్ల వృత్తిలో పెద్ద చిక్కులకు దారి తీయుట. జాతకుని శత్రువులు, తన స్నేహితులను ఆదరించుటయ ఉష్ణము, వేడి వలన జాతకునికి ఇబ్బందులు, స్థల మార్పు వలన జాతకునికి ఆదాయం.

**బుధుడు :** దైవసంబంధిత కార్యాయాలు యొక్క విజ్ఞానం వేదాలలోని మంచి విషయాలు జాతకుని నోట వినడం. ఆడవారు కనుక అయితే చేసిన తప్పులకు పశ్చాత్తాప పడడం. ఆమె తన సమయమును మేలు కోరు వ్యక్తులకు కేటాయించును. కుటుంబంలో చిన్నవారుకి అన్ని విధములుగా ఆనందాయకునిగా ఉండును.

**శుక్రుడు :** సిరి సంపదలు హెచ్చు కావుట, భార్యతో చిన్న చిన్న అపర్ధాములు. అందమైనా వస్తువులను కొనుట జాతకుని భార్య హోమములను దాని నిర్విహించు వ్యక్తులను కలుపుట.

**శని :** వృత్తిలో మార్పు మరియు ఆదాయము ఉన్నత పదవులు. వాతానికి సంబంధించిన ఇబ్బందులను సమాజంలో పెద్ద వ్యక్తులతో పరిచయాలు.

**రాహువు :** జాతకునకు మానసిక ఆందోళన, మొండితనం ప్రాణహాని, శరీరానికి ఎక్కువ నొప్పులు బాధించుట విదేశీ ప్రయాణాలు, చిక్కటి ప్రపంచంలో ఉండిపోయాము అని భావన.

**కేతువు :** దైవచింతన మరియు శుభకార్యములు నిర్వహించు కుతూహలము, మోక్షసాధన కోసం పరితప్పించడం నంతా సంబంధించిన బలహీనత. పవిత్రమైన వ్యక్తులలో కలయిక.

**4. శుక్రుడు :** జాతక చక్రంలో ఉన్న గ్రహాల మీద గోచారంలో ఉన్న శుక్రుడు సంచరించేటప్పుడు ఫలితాలు.

**రవి :** జాతకుడు ఆర్థిక ఇబ్బందులకు గురికావడం, జాతకుని భార్య అనారోగ్యం గురికావడం. కంటికి సంబంధించిన సమస్యలు, హృదయానికి.

**చంద్రుడు :** జాతకుడు ధనలేమి వల్లన ఆర్థిక ఇబ్బందులు గురికావుట. ఆర్థిక వొత్తిడి వలన జాతకుడు వివాదాలలోకి వెళ్ళుట. జాతకుని భార్యకు ఋతుసంబంధమైన సమస్యలు సంభవించుట మోసపూరకమైన వ్యక్తులతో పరిచయం చేసుకొనుట.

**కుజుడు:** జాతకుని భర్తవలన ఆర్థికంగా ఎదుగుదల రక్తసంబంధితం, ఆర్థికాభివృద్ధి హఠాత్తు నిర్ణయాల వల్ల ప్రమాదాలు.

**బుధుడు :** భూమి అమ్మకము వలన నిధి దొరికే అవకాశం వారసత్వపు ఆస్తిగా ఇల్లు వచ్చు అవకాశం. విజ్ఞానం అయిన వ్యక్తులలో పరిచయాలు సంతోషం, సంబరాలు జరుగుట.

**గురువు :** భార్యకు అన్ని విధాలా అనుకూల సమయం. జాతకునికి ఆర్థిక స్థిరత్వం, వృత్తిలో సంతోషం. తండ్రిగారికి అనారోగ్యం, తల్లికి కఫాన్ని సంబంధించి ఇబ్బందులు. తల్లిదండ్రులకు ఆర్థిక ఇబ్బందులు. ఆడవారి జాతకంలో భర్తకు, సోదరునకు, పిన్ని తండ్రికి ఆదాయం మరియు పై చెప్పిన వ్యక్తులు కోపాన్ని నియంత్రించ లేకపోవుట.

**శుక్రుడు :** స్త్రీలతో పరిచయాలు కూతురునకు కోడలకు, అక్కగారికి శుభకరమైన సంగతులు గోచరించుట మిత్రులనుంచి సహాయ సహాకార్యాలు అందుట భర్తతో, సోదరినితో చికాకులు, అత్తగారితో మనస్పర్థలు, అజీర్ణం.

**శని :** భార్య ద్వారా స్నేహితురాల ద్వారా ధనం ఆదాయం. కుటుంబం కొరకు సమయం కేటాయించుట. మామగారి యొక్క కుటుంబంలో పండుగలు, సంబరాలు, వృత్తిలో ఆర్థిక వొడిదుడుకులు, భార్య సోమరిగా ప్రవర్తించుట, కీళ్ళకు సంబంధించిన ఇబ్బందులు.

**కేతువు :** ఆర్థిక ఇబ్బందులు, ఇంటికి సంబంధించి వివాదములు, గర్భవతిగా ఉన్న ఆడవారికి గర్భస్రావము సంసార సౌఖ్యము దూరము, కుటుంబంలో ఆడవారు లక్ష్యసాధన కోసం ప్రయత్నించింది.

**రాహువు :** సమాజంలో డబ్బుగల వ్యక్తిలలో సన్నిహిత సంబంధాలు, నాలుగు చక్రముల వాహనము కొనుగోలు చేయు అవకాశము. వేరే స్త్రీలలో అక్రమ సంబంధాల ఏర్పచుకొనుట.

**5. వివిధ రాశులలో గ్రహాల మీద గోచారం శని సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు:-**

**రవి :** వృత్తిలో అనుకూలత తగ్గుట, వృత్తికి న్యాయం చేయలేకపోవుట అధికారాలలో తండ్రి సమానులలో పరస్పర విభేధాలు కంటికి సంబంధించిన ఇబ్బందులు. అన్నగారికి వృత్తిలో సానుకూలత.

**చంద్రుడు :** వృత్తిలో బదిలి మరియు నిందలు అనవసరపు ఖర్చులు. మానసిక ఒత్తిడి తల్లిగారి రక్తహీనత

**కుజుడు :** వృత్తిలో అన్ని రకాల అవమానాలు, విభేధాలు, సంసారంలో చిక్కులు, అన్ని రకాల ఖర్చులు, కాళ్ళకు సంబంధించిన సమస్యలు. వారసత్వపు ఆస్తికి సంబంధించిన దాయాదులతో విభేదాలు.

**బుధుడు :** వ్యాపార పరంగా అన్ని విధాలా అనుకూలం భూమి ద్వారా ఆదాయం, మిత్రుల వలన, కనిష్ఠుల వలన అన్ని రకాల ప్రోత్సాహం, సోమరితనం, రతి నిర్వహణ సమాజం తగ్గుట.

**గురువు :** వృత్తిలో ఉన్నతి హోదా పెరుగుట తద్వారా పేరు ప్రతిష్టలు పెరుగుట, కుజుడు గనుక శనికి 7వ ఇంటిలో ఉన్నట్లు అయితే ఆ ఉన్నత హోదాను శత్రువులు అడ్డుకొనుట జరుగుతుంది. చంద్రుడు ఉన్నట్లు అయితే వృత్తిలో బదిలీ జరుగుతున్నది.

**శుక్రుడు :** ఇంటిలో ఆర్థిక ఇబ్బందులు తొలగుట, శుభకార్యాలు నిర్వహించుట మిత్రుల ద్వారా ఆర్థిక సహకారం పొందుట.

**కేతువు :** అధికారుల వేధింపులు, వృత్తిలో చిక్కులు, చీకాకులు, వృత్తిని వదిలివేయాలనే భావావేశన గురువుకాని, శుక్రుడు గాని చూపులేక పోతే ఉన్న వృత్తి పోతుంది. కేతువు మీద కుజుడుగాని, చంద్రుడు దృష్టి ఉన్న వృత్తిలో బదిలీ అయి అక్కడ వ్యక్తుల ద్వారా వృత్తిని వదిలివేయడం జరుగుతున్నది. భూమికి సంబంధించి వివాదాలు.
**రాహువు :** వృత్తికి సంబంధించి దూరమైన ప్రదేశాలకు వెళ్ళిపోవుట. విదేశీ వ్యక్తులతో పరిచయాలు. ముస్లిములతో సంబంధాలు చదువుకు సంబంధం లేని వృత్తిని చేపట్టుట.

**6. జాతకంలో రాశిలోని వివిధ గ్రహాల మీద గోచారంలో రాహువు సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు :-**

**రవి :** తండ్రికి నిరాదరణ, పిల్లలకు ఇబ్బందులు, అనారోగ్యం, హృదయానికి సంబంధించిన సమస్యలు, పితామహునికి అధికారులతో విభేధాలు.
**చంద్రుడు :** మానసిక, శరీరక, ఆందోళలను, అమ్మగారికి అనారోగ్యం, చేతబడుల ప్రభావం చూడవచ్చును.
**కుజులు :** ప్రమాదాలు, గండములు, రక్తహీనత, సోదరినికి జాతకునికి మధ్య విభేధాలు.
**బుధుడు :** తెలివిగల అమ్మాయి, మాటకారిని పెళ్ళిచేసుకోవడం, స్నేహితులకు ఇబ్బందులు, సోదరికికూడా ఇబ్బందులు, చర్మ సంబంధించిన వ్యాధులు వస్తువులు వల్ల ఆదాయం.
**గురువు :** జాతకుని ముఖములో భయకవలికలు, కర్మ క్రతువుల నిర్వహించుట, హోమం, ముక్కు మీద గుర్తులు.
**శుక్రుడు :** వచ్చు ఆదాయంలో గండి అన్న రకాల సౌఖ్యములు సమకూరుట, ఆస్తుల విలువలు పెరుగుట, అక్రమ సంబంధం, భార్యకి, అక్కకి ముఖమునకు సంబంధించిన ఇబ్బందులు.
**శని :** నీచ కార్యాలు తత్ద్వారా ధన సంపాదన, క్రూర మనస్థత్వం వ్యక్తులలో సహవాసం, వస్తువులు కొనుట, సోమరితనం.
**రాహువు :** అధమ ఫలితాలు, కడుపుకు సంబంధించిన ఇబ్బందులు, ముస్లిములతో పరిచయాలు
**కేతువు :** మత సంబంధమైన పనులకు అడ్డంకులు, గండములు.

**7. కేతువు గ్రహం రాశిచక్రంలోని వివిధ గ్రాహల మీద గోచారంలో సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు:-**

**రవి :** తండ్రికి తీర్థయాత్ర సందర్శనం, ప్రభుత్వ సానుకూలత, బిడ్డ దైవ కృపకు పాత్రుడగుట.
**చంద్రుడు :** తత్వవేత్తకు సంబంధించిన ఆలోచనలు, పవిత్ర నదీజలాలు సందర్శనం, దావాలు, తల్లిగారికి పవిత్ర కార్యాలు మరియు అనారోగ్యం. జాతకునికి మానసిక ఆందోళనలు తత్ద్వారా ఇబ్బందులు.
**కుజుడు :** సోదరునితో వివాదాలు, స్త్రీ జాతకంలో భర్తకు వివాదాలు. స్త్రీ జాతకంలో కుజుడు బాగాలేకపోతే కౌశముందినయోగం (అనగా వైధవ్యము) ఇంటిలో వంటకు సంబంధించి కార్యకలాపాలు నిర్వర్తించలేకపోవడం. అధిక ఉష్ణము.
**బుధుడు :** చర్మరోగాలు, మామగారితో వివాదాలు, కొత్త విషయాలు నేర్చుకోగల అభిలాష జ్ఞాపకశక్తి సన్నగిల్లుట. పొలానికి సంబంధించిన విషయాలలో ఆసక్తి. కేతువుకు కుజుడు సంబంధం ఉంటే వ్యవసాయ సంబంధమైన వివాదాలు. ప్రేమ వ్యవహారంలో చిక్కులు. కేతువుకి రవి సంభంధం ఉంటే జెండా యోగం.

**గురువు :** తత్వవేత్తకు సంభంధించిన లక్షణాలలో ఒడిదుడుకులు. శరీరక శ్రద్ధ నశించుట, ప్రాపంచిక విషయాల మీద శ్రద్ధ తగ్గడం, నరాల బలహీనత, అనారోగ్యం.

**శుక్రుడు :** భార్యకు, అక్కకు, ఆర్థిక మానసిక ఇబ్బందులు ఆడవారి ముందు ముద్దాయిగా నిలబడడం, సంసారంలో ఒత్తిడి. ఇంటి విషయాలలో వివాదాలు.

**శని :** వృత్తి పట్ల అనాశక్తి, ఎక్కువ సెలవు కోరుకొనుట, పరిహారం కొరకు పుణ్యక్షేత్రం సందర్శన అన్ని సమానులతో నీలాపనిందలు. ఉద్దేశం, కోరిక లేక పోవుట

**రాహువు :** ప్రాపంచిక విషయాలలో అనాశక్తి, ఇబ్బందులు

**కేతువు :** కుటుంబంలో అపార్థాలు తత్ద్వారా చిక్కులు, ఇబ్బందులు.

**ఫలిత విభాగాము :-**

జాతకము ఆధారముగా ఫలితము నిర్ణయించ వలనన్న ఈ క్రింది విషయాలు గుర్తించుకోవాలి.

గ్రహాలు యొక్క బలము, స్వచ్ఛక్షేత్రం, మిత్రక్షేత్రం తరువాత ఉచ్ఛ క్షేత్రం ద్వారా బలాన్ని తెలుసుకొనవచ్చు.

గ్రహాలు పై తెలపబడినవి ఉన్నప్పటికి గ్రహమునకు ముందు, వెనుక, శత్రువు గ్రహాలు ఉంటే ఫలితాన్ని ఇవ్వజాలవు.

పాప గ్రహము రెండు శుభగ్రహముల మధ్య బంధి అయినప్పుడు పాప ఫలితము మరియు శుభ ఫలితము ఇవ్వలేని పరిస్థితిలో ఉండును.

శుభ గ్రహము రెండు పాప గ్రహముల మధ్యలో బంధి అయినప్పుడు శుభ ఫలితము ఇవ్వుటకు కొంత చిక్కులు ఏర్పడును.

పాప గ్రహము వక్రించిన గ్రహమునకు రెండువ ఇంటిలో ఉన్నప్పుడు మొదటి ఇంట రాశిలోనే ఫలితములు శుభకరంగా ఉండవు.

ఒక గ్రహమునకు ముందు వెనుక ఇళ్ళలో గ్రహాలే కాక ఆ గ్రహం నుంచి 7వ రాశిలోని గ్రహంతో మంచి సంబంధాలుంటే మంచి ఫలితం చెడ్డ సంబంధాలుంటే చెడ్డ ఫలితం ఇచ్చును.

ఒక గ్రహం ఉచ్ఛ పొందినప్పటికి దానిని 2,12,5,7 ఇళ్ళలో ఏ గ్రహాలు లేనప్పుడు, ఆ గ్రహాలు ఇచ్చు ఫలితాలు తక్కువగా ఉండును.

ఒక గ్రహం నీచ పొందినప్పుడు దానికి 2,12,5,7 ఇళ్ళలో ఏ గ్రహాలు లేనిప్పుడు ఆ గ్రహాలు ఇచ్చు ఫలితాలు తక్కువగా ఉండును.

పై చెప్పబడిన గ్రహాలకు 2,12,5,7 ఇళ్ళలో గ్రహాలు లేనిప్పటికి పరివర్తిన యోగం వల్లన ఆ గ్రహం మంచి ఫలితాలు ఇచ్చును.

పరివర్తిన చెందిన గ్రహం రవి వల్ల అస్తంగత్వం పొందితే ఫలితాలలో చాలా భేధము ఉంటుంది. అస్తంగత్వం వలన శుభగ్రహాలు, పాప గ్రహాలు తమ పూర్తి ఫలితాలను యివ్వజాలవు.

వక్రత్వవం వలన ఉచ్ఛపొందిన గ్రహం ఫలితంలో ఉచ్ఛపొందిన గ్రహం ఫలితాలు ఇచ్చును.

వక్రత్త్వం వలన గ్రహం ఉచ్ఛపొంది దానికి 2,7,5,12 ఇళ్ళలో గ్రహాలు లేనప్పుడు, ఆ గ్రహం పూర్తి ఫలితం ఇవ్వజాలదు.

ఒక గ్రహానికి 12వ ఇంట పాపగ్రహం ఉండి, ఆ పాపగ్రహం వక్రత్వం పొందినప్పుడు, ఆపాప గ్రహం యొక్క ప్రభావం పై చెప్పబడిన శుభ గ్రహంమీద ఉండదు.

రెండు గ్రహాలలో ఒక్కటి ఎక్కువ డిగ్రీలు ఉండి, మరొక్కటి తక్కువ డిగ్రీలు గతించి ఒకేరాశిలో కలియిక ఉన్నప్పుడు, ఎక్కువ డిగ్రీల ఉన్న గ్రహం వక్రత్వం అందులో ఉండే అందులో కూడా మనం వక్రత్వమునే చూడాలనే కానీ, గ్రహం ఎక్కువ డిగ్రీలు గతించినదని ఫలితం చూడకూడదు.

రెండు గ్రహాలు పరివర్తన యోగంలో ఒక గ్రహం నీచ పొందినప్పుడు, ఆ గ్రహానికి 2,12,5,7 ఇంటిలో ఆ గ్రహానికి మిత్ర గ్రహం ఉన్నప్పుడు నీచత్వం పరిహారం అవును.

భృగునాడి పద్ధతి లగ్నగానికి ప్రాధాన్యత ఉండదు. అంతేకాకుండ మొదటి ఇల్లు, రెండవ ఇల్లు అను మాటలు వినిపించవు.

ఇక్కడ ప్రతి గ్రహాన్నికి, 1,5,7,9 దృష్టులు ఉండును. కానీ చాయా గ్రహాలు అయినా రాహుకేతువు గ్రహాలుకు, 1,5,9 దృష్టులు ఉండును.

ఒక్క గ్రహం ఉన్న స్థానం నుంచి 5,9వ స్థానంలో ఉన్నట్టుగా భావించాలి.

ఉదా: శనిమేష రాశిలో ఉండి రవి కన్యరాశిలో ఉన్నప్పుడు జాతకున్నకు గవర్నమెంట్ సంబంధించిన ఆదాయము అని చెప్పవచ్చు. అదేవిధముగా అనగా పై చెప్పిన సూత్ర ప్రకారం వృత్తి కారకుడై శని 5వ ఇంటికి రావుట శని నుంచి రెండవ ఇంటిలో అనగా ఆదాయం సంబంధించిన ప్రదేశమును ప్రభుత్వ కారకుడైన రవి ఉండుట వలన జాతకున్నకు ప్రభుత్వ నుంచి ఆదాయం వచ్చును.

7వ భావమునకు ఒక గ్రహానికి సంబంధించిన అయితే అదే గ్రహానికి, 3, 11 భావాలు కూడా సంభందించిన్నదే.

భృగునాడి గురువును మగవారికి జీవకారకునిగా ఆడవారికి శుక్రుని జీవకారకునిగాను భావించి జాతకమును వివరించుట జరుగుతున్నది.

జాతకంలో గురువుకు ముందు, వెనుక ఉన్న గ్రహాల ప్రకారం జాతకుడు పుట్టు ప్రదేశాన్ని జాతకంలో రాహువు ఉన్నదాని ప్రకారం జాతకుని ఇంటి ముఖద్వారం ఏ వైపు ఉన్నదో తెలుసుకొనవచ్చు.

గురువు గ్రహాన్ని చూచి గ్రహాలు పట్టి జాతకునికి ఎటువంటి పేరు వచ్చునో అని ముందుగా తెలుసుకొనవచ్చు.

నక్షత్రాలు పరివర్తన వలన కూడా గ్రహాలు యొక్క మార్పు చెందును.

ఒక గ్రహం ఉచ్ఛ, స్వఛ్ఛేత్రం, మిత్రక్షేత్రం అయినా రాశులలో ఉన్నప్పటికి తను తరువాత ప్రవేశించు రాశి ఆగ్రహం మిత్రక్షేత్రం అయిఉండవలెను అప్పుడే ఆగ్రహం మిక్కిలి ఫలితాలు ఇవ్వబడును.

ఉదా: కర్కాటకరాశిలో గురువు ఉచ్ఛనపొంది తరువాత తన మిత్రక్షేత్రమునకు అధిపతి అయినా రవి ఇంటికి అనగా సింహరాశిలో సంచరించు అవకాశాలు ఉన్నాయి. కావున మిత్రుడైన రవియొక్క ఫలితాలు గురు గ్రహమే పొంది తాను ఇచ్చు చున్నాడు.

భ చక్రంలో త్రికోణం కనుక ఏ గ్రహాలు లేనప్పుడు జాతకుడు పుట్టు ప్రదేశము కాలిఉండును.

భ చక్రంలో రవి గ్రహం నుంచి తరచుగా రవికి మిత్రగ్రహములు రవినుంచి 1,2,3 ఇళ్ళలో ఉన్న జాతకుని, తండ్రి, కొడుకులు సంభంధం అత్యున్నత స్థాయికి చేరును.

భ చక్రంలో చంద్ర గ్రహం నుంచి 1,2,3 ఇళ్ళలో చంద్రునకు మిత్ర గ్రహములు ఉన్న చంద్ర కారకత్వాలు అభివృద్ధి చెందును. అదే విధంగా మనం జాతకములో బుదుని నుండి విద్యను, గురువు నుండి సంపద, శుక్రుని నుండి, ఇల్లు, వాహనం, కుజుని నుండి ధైర్య పరాక్రములు, రాహువు నుండి మార్మిక కళలు, కేతువు నుండి కీర్తి ప్రతిష్టలు మనం ఇదేవిధంగా గమనించవచ్చు. అనగా భ చక్రంలో ఒక గ్రహమునకు ముందు, వెనుక మిత్రగహములు, తరువాత క్షేత్రములో కూడా ఆ గ్రహమునకు మిత్ర గ్రహములు కలిగిన జాతకంలో ఆ గ్రహములు కారకములు అభివృద్ధి అగును.

జాతక చక్రంలో గోచారం వల్ల కూడా రాశిని గ్రహాలను పరివర్తన చేయును.

జాతక చక్రంలో మిత్రగ్రహాలు ఆధారంగా చక్కని పరిచయాలు తెలుసుకొనుటకు ఉపయోగపడును.

రాహు, కేతువులు ఏ రాశిలో ఉండునో ఆరాశికి సంబంధించిన అధిపతి ఏ గ్రహములో అయినా కలియిక, చూపు ఉంటుంది. ఆ గ్రహము యొక్క కార్యక్రమములు నశించును.

కన్యారాశిలో ఏ గ్రహము అయితే ఉంటుందో ఆగ్రహం యొక్క బంధుత్వం జాతకునికి పరిపూర్ణంగా లభించదు.

గురువు జీవకారకునిగా తరువాతది, చిన్నవారిగాను, వెనుకది పెద్దవారిగాను భావించాలి.

1,5,9 గ్రహాలు ఏవిధంగా అనుభవంలోకి వచ్చును.

7,10 ఏ రకముల కొరకు, జాతకుడు కష్టపడవలెను.

6,8,12 పనితనముల కొరకు దైవకృప కావలెను.

**రవిగ్రహం :**

ఈ గ్రహాన్ని గ్రహాలకు రాజుగా వర్ణించారు. ఒక్క వ్యక్తి లక్షణం తెలుసుకోవాలంటే జాతకంలో రవి చాలా కీలక పాత్ర వహిస్తారు. రవి కుడి కంటిని, హృదయాన్ని తూర్పుదిక్కుకు, ఉంగరం వ్రేళ్ళకు అధిపతిగా పేర్కొనవచ్చు. రవి అనుగ్రహం వలన మానవుడు ఒక వైద్యునిగాను, ఉన్నత ప్రభుత్వ అధికారిగా ఉంటూ సమాజంలో ఒక్క రాజుకు ఎటువంటి భోగము ఉండును కీర్తి ప్రతిష్టలు ఉండును మనం రవి గ్రహము బట్టి తెలుసుకొనవచ్చు. జాతకంలో రవిని పెళ్ళికానంత వరకు తండ్రిగాను తరువాత కుమారునిగాను పేర్కొనబడుతుంది.

**రవి గ్రహము వివిధ రాశులలో సంచరించినప్పుడు ఏర్పడు ఫలితాలు :-**

రవి గ్రహము ఒక రాశి నుంచి మరొక రాశికి సంచరించినప్పుడు పట్టుకాలము 30 రోజులు.

**మేషరాశిలో రవి :-**

మేషరాశిలో రవిని ఉచ్ఛగ్రహంగా పేర్కొంటారు. ఈ రవి మేషరాశిలో ఉన్న జాతకున్నకు తండ్రి గవర్నమెంట్ ద్వారా కానీ, బియ్యపు వ్యాపారం ద్వారా కానీ రాజకీయంలో కానీ, ఆదాయం పొందు అవకాశం ఉంటుంది. మేషరాశి రవికి మిత్రక్షేత్రం అయినా కుజక్షేత్రం కావడం వలన తండ్రికి తప్పని సరిగా ఒక స్థలంగానీ, పాడుపడిన లేక పాత ఇల్లు కానీ పొందును. ఈ క్షేత్రంలో చంద్రుడు నీచ పొందక పోయినప్పటికి మరొక కుజ క్షేత్రం అయినా వృశ్చికరాశిలో చంద్రుడు నీచ పొందుట వలన తండ్రికి చంద్రకారక్కనత్వం లోపించి ఎక్కువ ప్రయాణము మానసికంగా ఆందోళనలను జాతకునికి, తండ్రికి కంటికి సంబంధించిన సమస్యలు మొదలైనవి మనం చూడవచ్చు.

ఇదే క్షేత్రంలో కుజుడికి శత్రువు కారకుడైన బుధుడు రవిమీద జాతకంలో దృష్టి లేనప్పుడు భుధుడిని మేషంలో ఉన్నట్లుగానే భావించి ఫలితాలు చెప్పడం ద్వారా తండ్రికి తన కనిష్ట సోదరికి, మరియు భూసంభంధమైన వివాదాలు నరాల బలహీనత, చర్మ సంబంధమైన సమస్యలు ఈ విధంగా బుధుకారకత్వాలు వర్ణించుకోవచ్చు.

ఇదే మేషరాశిలో మిత్రుడైనా గురువు గ్రహం వల్ల చక్కని ఆర్థిక స్థితి, వేదవిజ్ఞానం, సాత్విక స్వభావం, తండ్రిగారి ముక్కు పొడవుగా ఉండుట, ఉంగరం వేళ్ళుకన్నా, చూపుడువేళ్ళు పొడవుగా ఉన్న సూచనలు మనం గమనించవచ్చు. కుజక్షేత్రంలో మేషరాశి తనకు శత్రు కారకుడైన శుక్రుడు వల్ల ఆడవారితో ఇబ్బందులు ఆడవారి వలన ధనం, స్థలం, పేరుప్రతిష్టలు కలిసిరావుట, మాటవినని భార్య ఉండుట, కోడలు, కూతురు మొదలైనవి మనం తండ్రికి చూడవచ్చును.

ఇదే క్షేత్రంలో క్షేత్రానికి శత్రువు మరియు నీచ కారకుడైన శనిభగవాదుని వలన తండ్రికి యంత్ర సంబంధమైన వృత్తిలో సహాయసహకారం లోపించుట తండ్రి అన్నగారు మిక్కిలి ఇబ్బందులు జీవితంలో ఎదుర్కొనుట జరుగుతుంది. ఇటువంటి శని కారకత్వములు లోపించుట మనం చూడవచ్చును.

ఇదే క్షేత్రంలో రవికి శత్రువు గ్రహం అయిన రాహువును ఊహించినప్పుడు తండ్రి విదేశాలకు వెళ్ళడం, ఎక్కువ సేవ చేయడం చక్రానికి కారకుడైన రాహువు వలన తండ్రిగారికి వాహన యోగం.

ఇదే క్షేత్రంలో కేతువు ఊహించినప్పుడు కేతువు కలయిక వలన నాగదోషం ఏర్పడి తండ్రి ఇబ్బందులు ఎదుర్కోవడం కాక కేతువు జెండా యోగం తండ్రికి వర్తించి కీర్తి ప్రతిష్టలు వ్యాపించును.

**వృషభరాశిలో రవి :-**

వృషభరాశి శుక్రగ్రహమునకు సంబంధించిన రాశి ఈ శుక్రుడునకు అధిపతి లక్ష్మీదేవి. ఆమె సిరి సంపదలకు ప్రతీక తండ్రికి, కుమారునకు లక్ష్మీదేవి అనుగ్రహం ఉండును. వృషభరాశి వెనుక రాశి అయిన మేషరాశిలో శుభగ్రహం ఉన్నచో తండ్రి మంచి ఆర్థికస్థితి నుంచి పైకి వచ్చాడని చెప్పవచ్చు.

వృషభరాశి ప్రక్కక్షేత్రం అయినా మిధున రాశికి బుధుడు అధిపతి అయిన వలన తండ్రికి చక్కని వాక్చాతుర్యం. వ్యాపార దక్షత జన్మతహ: సిద్ధించును. తండ్రి నుదురు వెడల్పుగా ఉండుట, చిటికిన వేళ్ళు,

ఉంగరం వేళ్ళు మొదట కనుపును దాటడం, మనం గమనించ వచ్చు.

**మిధునరాశిలో రవి :-**

ఈ రాశిలో రవి, బుదుడు ఇంటిలో ఉండుట వలన రవి బుధుడు లక్షణాలు అయిన చక్కని మాట తీరు ఆలోచనా శక్తి, జాతకుని కొడుకు, కళలకు వ్యాపారమునకు సంబంధించిన వృత్తిని గమనించచ్చును.

**కర్కాటక రాశిలో రవి :-**

ఈ రాశికి అధిపతి చంద్రుడు. రవి, చంద్రాదుల కలయిక అమావాస్య. కావున రవి చంద్రుడు ఇంటిలో ఉండినప్పుడు ఈ ఫలితాలను ఎక్కువగా చూడవచ్చు. చంద్రుడు యొక్క ఫలితాలు రవి ఇచ్చును.

ఉదా: చంద్రుడు ఖర్చునకు, అనుమానానికి జనంలో పనిచేయు వృత్తికి కారకుడు. కావున మనం రవి, చంద్రుడు సంబంధించిన ఫలితాలు ఇస్తూ, చంద్రుడు యొక్క పక్క క్షేత్రం తన రాశి అవుట వలన ఎక్కువ మంది జాతకులకు రవి కర్కాటకంలో ఉంటే తండ్రికి ప్రభుత్వ ఉద్యోగం ఇచ్చును. ప్రతి జాతకంలో గ్రహం చూసి ఫలితం చెప్పునప్పుడు ఆ గ్రహం మీద మిగతా గ్రహాల వీక్షణలు కూలంకషంగా పరిశీలించి తీర్పు చెప్పవలెను.

**సింహరాశిలో రవి :-**

సింహరాశిలో రవి ఉన్నప్పుడు తండ్రి లావుగా ఉండడం. తండ్రి దవడలు వెడల్పుగా ఉండడం. మాటలో గాంభీర్యం. సమాజంలోని అధికారుల మన్నలను పొందుతూ అధికారులు తండ్రి నిర్ణయం కొరకు వేచి ఉండు పరిస్థితులు. ధనానికి లోటు లేకుండా ఉండడం మనం గమనించవచ్చు. భార్య ద్వారా సుఖశాంతులు లోపించుట.

ఉదా : సింహరాశి పక్కక్షేత్రం కన్యరాశి అగుట వలన అందులో శుక్రుడు నీచ పొందుట వలన మనం పై చెప్పబడిన లక్షణాలు చూడవచ్చు.

**కన్యారాశిలో రవి :-**

మిధునరాశికి కన్యారాశికి అదిపతి భుధుడు. కావున ఎక్కువగా మిధునరాశిలో రవి ఏవిధంగా ఉంటే అటువంటి ఫలితాలు ఇస్తూ కన్యారాశి వ్యవసాయానికి పరిశ్రమలకు అధిపతి గనుక తండ్రికి స్వతంత్ర ఆలోచనలు ఎక్కువ ఉండును. కన్యారాశి తదుపరి క్షేత్రం తులారాశి అగుట వలన అందులో రవి నీచ పొందుట వలన తండ్రికి శుక్రుడు వలన సిరిసంపదలు నీచ పొందుట వలన అనారోగ్యం పొందును.

**తులారాశిలో రవి :-**

వృషభానికి, తులకు అధిపతి శుక్రుడు అందువలన ఎక్కువగా తండ్రి వృషభరాశిలో ఉన్న లక్షణాలతోపాటు

తండ్రి ద్వితీయార్ధంలో మంచి స్థితికి చేరును. తులారాశికి పక్క క్షేత్రం వృశ్చికం. దీనికి అధిపతి కుజుడు. రవికి మిత్రుడు. కావున అధికారులలో తండ్రికి సమాజంలో సహాయసహకారాలు ఉంటాయి.

**వృశ్చికరాశిలో రవి :-**

తండ్రికి వృత్తిరీత్య యంత్రమునకు, గుఢాచారముల విభాగానికి, మరణానికి సంబంధించిన వృత్తులు. తండ్రి కష్టపడి ఆర్థిక ఒడిదుడుకులు ఎదుర్కొని జీవితంలో పైకి వచ్చిన వ్యక్తిగా చూడవచ్చు. కొడుకు కూడా తండ్రి యొక్క వృత్తిని స్వీకరించే అవకాశాలున్నాయి.

**ధనస్సులో రవి :-**

తండ్రికి వేదశాస్త్రంలో చక్కని అవగాహన గురువు క్షేత్రంలో శుక్రుడు ఉచ్చకనుక శుక్రునియొక్క సిరిసందలు తండ్రికి, కొడుకునకు సంక్రమించును. తండ్రికి కొడుకులు గ్రామాలలో నివసించే పరిస్థితి ఏర్పడును. వృత్తిలో ఆటంకమును ఎదుర్కొనుట, బలహీనత సమస్యలు కలిగియుండును.

**మకరంరాశిలో రవి :-**

మకరరాశిలో రవి ఉన్నప్పుడు తండ్రికి ఎక్కువుగా ప్రయాణాలు చేయు వృత్తి యంత్ర సంబంధించునకు వృత్తి. వృత్తిలో నీలాపనిందలు పొందుట, అనారోగ్యం సూచన పాతఇళ్ళు కలిగి ఉండుట, ఆర్థిక ఒడిదుడుకులు మనం గమనించవచ్చును.

**కుంభరాశిలో రవి :-**

కుంభరాశిలో పరిశోధనా స్థానం, అయిన్నాడు వలన, తండ్రికి ఒక విషయం మీద పరిపూర్ణ జ్ఞానం మరియు పరిశోధనాశక్తి కుంభరాశికి సప్తమం సింహరాశి అయిన వలన గవర్నమెంట్ అధికారాలలో సంబంధాలు పక్కక్షేత్రం గురువు సంబంధించి రాశి అయిన వలన తండ్రి తన ద్వితీయార్థంలో ఆర్థిక ఒడిదుడుకులు అధిగమించును.

**మీనరాశిలో రవి :-**

మీనరాశికి, ధనస్సుకు గురువు అధిపతి ధనస్సురాశి తరువాత క్షేత్రం మకరరాశిలో రవి శక్తిని పొందుతాడు. కాని మీనరాశిలో తన తరువాత క్షేత్రంమైనా మేషరాశిలో ఉచ్చను పొందుట వలన రవికి మిక్కిలి సానుకూల అంశాలుండును.

ఉదా: మీనరాశిలో కేతువు మూల త్రికోణం కనుక తండ్రికి మోక్షసాధన సంబంధించి, న్యాయసేవకు సంబంధించిన జ్ఞానం. ఇక్కడ శుక్రుడు ఉచ్చ కనుక మీనరాశి సహజంగా మంచుకొండల సంబంధించిన ప్రదేశము వలన తండ్రి, అక్కగారు దూరదేశముగా వెళ్ళవలసి వస్తుంది. ఇదే క్షేత్రంలో బుధుడు నీచ అవడం వలన బుదుడు యొక్క శక్తి తండ్రికి లోపించి తండ్రికి, కొడుకు భుజాలకు సంబంధించిన ఇబ్బందులు చర్మానికి, నరాలకు

ఇబ్బందులు. వాక్‌దోషం ఇటువంటి విషయాలు మనం గమనించవచ్చు.

**రవితో ఇతర గ్రహాల ఏర్పడు ఫలితాలు :-**

**రవి, చంద్రుడు :**

మనకు పురాణాలలో రవి, చంద్రులకు ఒక్క ప్రత్యేకమైన స్థానం ఉన్నది. రవి, చంద్రుడు సమసప్తకాలలో ఉంటే పౌర్ణమి అని, రవి, చంద్రులు కలిసింటే అమావాస్యఅని, ఈ అమావాస్య, పౌర్ణమి వలన సముద్రంలో ఆటుపోట్లు ఎంత తీవ్రంగా ఉండునో, జాతకుని యొక్క మనస్సు అంత తీవ్రంగా ఉండును. చంద్రుడు మనసు కారకుడు. ఖర్చుకు సంబంధించినవాడు, నీలాపనిందలు సంబంధించినవాడు, ప్రయాణాలకు సంబంధించినవాడు, జన ఆకర్షణ, కళ్మాకదృష్టి, ఉపాధ్యాయవృత్తి, చంద్రుడు కఫాన్ని సంబంధించినవాడు కనుక తండ్రికి కఫాన్ని, రక్తహీనతను మనం గమనించవచ్చు. చంద్రునకు 2,12,5,7 రాశులలో ఏ గ్రహంలోకపోతే తండ్రికి సంబంధించిన లక్షణాలే తల్లిగారి విషయంలో చూడవచ్చు.

**రవి, కుజుడు :**

రవిని, రాజుగాను, కుజుడు సైన్యాధిపతిగాను మనం పురాణాలలో గ్రహాలను ఈ విధంగా వర్ణిస్తారు. దీని ఖడ్గయోగం అని అనవచ్చును. ఈ జాతకులకు కార్యదీక్ష, పట్టుదల ఒక్కరికి తలవంచని స్వభావం, మొండితనం పై లక్షణాలు మనం గమనించవచ్చు. రవి, కుజులు ఏ రాశిలో ఉన్నారో ఆ రాశి యొక్క అధిపతి దానిలోని ఉచ్ఛ, స్వక్షేత్రం, మూలత్రికోణం, గ్రహాలను పరిశీలించి మనం అభిప్రాయాలను వెల్లవడించాలి. రవి, కుజుడు ఇద్దరు ఉష్ణం సంబంధించిన గ్రహాలు, ఉష్ణం సంభంధించిన సమస్యలు ఎక్కువగా బాధించెను. ఫలిత నిర్ధారణలో రవి, కుజుడు ఉన్న రాశి అధిపతి తత్ స్థానానికి 6వ ఇల్లు,12లో ఉండరాదు. శత్రువు క్షేత్రం, నీచ క్షేత్రంలో ఉండరాదు. దానికి సప్తమాధిపతి మంచి క్షేత్రం ఉన్న రవి, కుజులకు అధికబలం ఎక్కువ. మంచి ఫలితాలు ఇచ్చును. ఈ జాతకులు మంత్రులు, ప్రధాన మంత్రులు మొదలగు వారికి అంతరంగికులుగా వారి పక్షముగా చేరి వీరి జీవిత కార్యాకలాపాలు కొనసాగిస్తారు.

**రవి, భుధుడు :**

రవి అనగా క్షత్రియుడు. బుధుడు అనగా వైశ్యుడు. వీరి కలయిక వలన రవి క్షేత్రము వదిలి వ్యాపార దక్షతకు పాధ్యము ఇచ్చు వ్యక్తిగా మనం చూడవచ్చు. రవి, బుధుడు వలన తండ్రికి సోదరి ఉండటం. ఆ సోదరి తన బిడ్డ ద్వారా మిక్కిలి సుఖములు పొందడం మనం గమనించవచ్చు. తండ్రికి మేధోసంబంధం కారకుడైన బుధుడు కలయిక వలన తండ్రికి వ్యాపార దక్షత, అకౌంటింగ్ విభాగము, కామర్స్, వ్యవసాయం మొదలైన రంగాలలో తనదైన ముద్రను తండ్రి కనిష్ట సోదరునుకు, గవర్నమెంట్‌కు సంబంధించిన అవకాశములు స్త్రీ సంతానం అధికం. స్త్రీల వలన పనులు చేకూరుట మనం గమనించవచ్చు.

**రవి, గురువు :**

రాజరికం అయిన రవి బ్రాహ్మణ గ్రహమైన గురు కలయుక వలన రవి గురువు యొక్క లక్షణాలను ఇచ్చువాడు అవుతాడు. జాతకుడుని మనం గురువుగా భావించాలి. రవికి తండ్రిగా భావించాలి. గురువు + రవి జాతకుడు కోపస్వభావము. రవి + గురువు జాతకుడు శాంతి స్వభావము. దీనిని రాజ ప్రతాపయోగమని, జీవాత్మ సంయోగమని అంటారు.

ఈ జాతకునికి చిన్నవయస్సులోనే తండ్రి వృత్తి చేయు పరిస్థితులు ఏర్పడును. వీరు రాజరిక లక్షణములతో 30 సంవత్సరముల తరువాత అతని గతం ఎటువంటిది అయినా పేరు ప్రతిష్టలు సమాజంలో పొందును. వీరు వేద శాస్త్రము, సాంప్రదాయమును పాటించెను. వీరికి రక్తము సంబంధించిన సమస్యలు, నరాలకు సంబంధించిన సమస్యలు. వీరికి జన్మతహ ఉండును.

**రవి, శుక్రుడు :**

జాతకంలో రవి, శుక్రుడు శత్రువులు కావున వీరి కలయిక కొంత అవయోగమని చెప్పాలి.

ఉదా : భార్య కార్యకుడైనా శుక్రుడుకు అధికారకుడైనా రవి కలిసినా వల్ల భార్యకు అధికార యోగం మరియు పురుషుల లక్షణాలు ఎక్కువుగా ఉండును.

శుక్రుడు డిగ్రీలు కన్నా, రవి డిగ్రీలు ఎక్కువు ఉన్నచో మగవారికి రవి యొక్క శక్తి వలన వీర్యకణములకు కారకుడైన శుక్రుని చేరుట తత్ద్వారా సంతానహీనుడు. గురువు చూపుబట్టి గ్రహాలు పరిశీలించి ఫలితము నిర్ధన చేయాలి.

**రవి, శని :**

రవి, శని తండ్రికొడుకులు. జన్మతహ పరస్పర శత్రుత్వం ఉన్నవారు. ఇవే లక్షణాలు జాతకునికి, తండ్రి గోచరించడం చూడవచ్చు. వృత్తి కారకుడైన శనికి అధికార కారకుడైన రవితోడైతే వృత్తిలో ఇబ్బంది ఉన్నప్పటికి అధికారం గల వృత్తి ఉంటుంది.

ఉదా : ప్రభుత్వ ఉద్యోగం

రవి, శని కలయిక వల్ల తండ్రికి కాళ్ళనొప్పులు తరచు, ఆనారోగ్యం మనం గమనించవచ్చు.

**రవి, రాహువు :**

రాహువు గ్రహాన్ని పితామహునిగా పేర్కొంది. రవి, శనిలకు ఎటువంటి లక్షణాలు ఉన్నాయో, రవి, రాహువుకి కూడా అలాంటి లక్షణాలు ఉంటాయి. రాహువు చక్రానికి సంబంధించిన వాడు కావున తండ్రికి వాహనయోగాన్ని కంప్యూటర్ విద్యనందు పరిజ్ఞానాన్ని, రాజకీయాన్ని ఉన్నది, లేనట్టు, లేనిది ఉన్నట్లు చెప్పేది. ఈ రాహువు వల్లన తండ్రికి, మొదటికొడుకుకి ఇబ్బంది జరుగును.

**రవి, కేతువు :**

దీని నాగదోషం గాను, తండ్రికి యోగం గాను చెప్పబడును. దీనివలన తండ్రికి పేరుప్రతిష్టలు నలుమూలల వ్యాపించడం మరియు కోర్టుకు సంబంధించిన సమస్యలు తండ్రి ఎదుర్కొనుట జరుగుతుంది. ఈ యోగం వలన తండ్రికి సంసారభంధం దూరమగుట, మోక్షం కొరకు పరితపించడం జరుగుతుంది.

**మేషరాశిలో చంద్రుడు :**

మేషరాశిలో రవి ఉచ్చపొందుట వలన తల్లి ముఖ్యమైన పట్టణాలలోనే జన్మించును. మేషం తరువాత రాశి అయిన వృషభంలో చంద్రుడు ఉచ్చ పొందుట వలన తల్లికి సహజసిద్ధ అధికార లక్షణాలు. ఉన్న వృత్తిలో ఉచ్ఛస్థితికి చేరుట.

మేషం మరియు వృశ్చికం = కుజుని క్షేత్రాలు. ఇక్కడ మనం చంద్రుని నీచగా ఉండవచ్చు. కావున తల్లికి మొదటి అక్కకు, అత్తగారికి రక్తహీనత, నరాలబలహీనత సంసారంలో ఒడిదుడుకులు, పేరు ప్రతిష్టలు తల్లిగారి భర్తయందు స్థితి ఉండుట.

ఉదా : చంద్రుడు పాలకు సంబంధించిన కారకుడు.కావున వృశ్చికంలోగాని మేషంలోగాని చంద్రుని ఉంటే జాతకునుడు చిన్నతనంలో తల్లి పాలు కొరకు ఇబ్బంది పడును.

**చంద్రుడు**

మనం చంద్రుడిని పౌర్ణమిగా భృగునాడిలో వర్ణిస్తాము. చంద్రుడు వంట సామాన్లు, మనసు, నీరు, మంచితనం, కళ, స్నేహితురాలు, సముద్రం, చలిగా వర్ణిస్తాము. చంద్రుడు బాగలేకపోతే ఖర్చుపెట్టేది స్థితి, మతిస్థిమితం మొదలగునవి. ఏర్పడును. చంద్రుడు తల్లిగారిని, అత్తగారిని, మొదటి అక్కగారికి సంబంధములో సూచించును.

**వృషభంలో చంద్రుడు**

చంద్రుడు వృషభరాశిలో ఉచ్చ స్థితి ఉండుటవలన సమాజంలో పేరుప్రతిష్టలు, గౌరవ మర్యాదలు కలిసి ఉండును. వృషభం, సప్తమం వృశ్చికం, దీనికి అధిపతి కుజుడు ద్వితీయం మిధునం దీనికి అధిపతి భుధుడు. కనుక ఈ రెండు గ్రహాలు బాగలేకపోయిన జాతకుడు అనేక రకముల ఇబ్బంది పడును. ఇదే వృషభంలో ఉచ్చకావున తల్లి భయమునకు లోనుకావుట తర్వాత అనారోగ్యం మొదలగునవి మనం గమనించవచ్చు.

**చంద్రుడు మిధునంలో :**

చంద్రుడు మిధున రాశిలో ఉండగ జాతకుడు, తల్లి తెలివిగలవారు అని చెప్పాలి. చంద్రుడు తర్వాత వచ్చు తరువాత క్షేత్రం కావున మిధునం సహజ పరాక్రమ కావున జాతకుడు చంద్ర సహకారం అయిన కళలతో

జాతకుడు సమాజమును ఆకర్షించును. బుధుని క్షేత్రంలో శుక్రుడు నీచ కనుక చంద్రునకు అనగా తల్లిగారికి వలన ఇబ్బందులు కలుగును.

**చంద్రుడు కర్కాటకంలో :**

చంద్రుడు కర్కాటకంలో స్వక్షేత్రంలో ఉన్నప్పటికి అదే క్షేత్రంలో గురువు ఉచ్ఛ అవడం చేత ఎల్లప్పుడు ధన చింతన, కుజుడు నీచ అగుట చేత రక్తహీనత సమస్యలు ఏర్పడటం జరుగును. కర్కాటంలో కుజుడు నీచ కనుక తల్లి, భర్తగారు అనారోగ్య సమస్యలలో బాగా ఇబ్బంది పడును. సరిఅయిన నిర్ణయం జాతకుడు చేసుకొనలేక ఇబ్బందిపడును.

**చంద్రుడు సింహంలో :**

చంద్రుడు సింహరాశిలో ఉండగా రవి లక్షణాలు చంద్రుడు పరాకాయ ప్రవేశం చేయును. కావున రాజు కావలెనని కోరిక దాని కొరకు జీవితం ఎక్కువ ఇబ్బందులు పడును. సింహం క్షత్రియ క్షేత్రం కనుక జాతకుడు చేసుకొను నిర్ణయాలు చాలా ఖచ్చితంగా, తెలివిగా ఉండును. తల్లిగారి కుటుంబంలో బాధ్యతలను తండ్రినుంచి తీసుకొని తానే నిర్వహించును.

**చంద్రుడు కన్యలో :**

చంద్రుడు కన్యరాశిలో ఉండుట వలన ఉచ్ఛఅయిన బుధుడు మరియు నీచ అయిన శుక్రుడు ఉన్నత స్థాయిలో ఉండును. కావున ఇక్కడ జాతకుడు తెలివిగలవాడు. స్త్రీమూలకంగా ఇబ్బంది పడువాడు మరియు అధిక ఖర్చులు కలవాడు. అప్పులు చేయువాడు కావున జాతకుడు స్వతంత్రంగా పనిచేసుకొనవలెనని మిక్కిలి అభిప్రాయం కలిగి ఉండును.

**చంద్రుడు తులరాశిలో :**

చంద్రుడు తులరాశిలో ఉండుట మన జాతకుడు ఎప్పుడును సంపాదించవలెనని అభిలాష మరియు ఈ క్షేత్రంలో రవి నీచకనుక తల్లికి అమావాస్య పుట్టినరోజు వలె జాతకుని నిర్ణయం ఉండుట గమనించవచ్చు. ఈ క్షేత్రం శని ఉచ్ఛకావున జాతకుని వృత్తికి ప్రమాదాలు, బదిలీలు, అవమానాలు మొదలగునవి మనం గమనించవచ్చు. జాతకుడు రహస్య పనుల ద్వార ఎక్కువ ధనం సంపాదించు అవకాశం ఉన్నది. మరియు తల్లి గారికి జీవిత ద్వితియార్థం జాతకుని తల్లి ఆరోగ్యం దెబ్బతినును.

**చంద్రుడువృశ్చికంలో :**

చంద్రుడు వృశ్చికంలో ఉండుట ఇది సహజ మార్మిక స్థానం కావున జాతకుడు మార్మిక కళల పట్ల ఆసక్తి కలిగి ఉండును. జాతకుడు చిన్నతనములో తల్లిపాలకు దూరం కావటం మనం గమనించవచ్చు. క్షేత్రంలో కేతువు ఉచ్ఛ కనుక జాతకుని మోక్షసాధన మరియు, బోధకుని తత్వం, మనం జాతకునిలో గమనించవచ్చు. జాతకుని కుటుంబంలో స్త్రీలకు ఒక సంతానం దెబ్బతిను అవకాశం కేతువు వలన మనం గమనించవచ్చు.

**ధనస్సులో చంద్రుడు :**

జాతకుడు ధనస్సు లో చంద్రుడు చాలా మంచి వ్యక్తి, పవిత్రత గలవాడు మరియు ఉదారస్వభావం గలవాడు. జాతకుని తల్లి కష్టముల నుంచి చాలా పైకి వచ్చిన వారై ఉండును. ఆమె జీవితంలో ఎక్కువ క్లిష్ట సమస్యలతో పోరాడును. జాతకుడు క్రోధ స్వభావం కలిగి ఉండుట తర్వాత ఆర్థిక ఒడిదుడుకుల సమస్యలు కలుగుట జరుగును.

**మకరంలో చంద్రుడు :**

చంద్రుడు మకర రాశిలో ఉన్న వారికి ఎక్కువ కోపము రావుట, గౌరవము లేని పనులు చేయుట, చక్కెర వ్యాధికి సంభంధించిన సమస్యలు, కాలేయం, అజీర్ణం సమస్యలు మనం గమనించవచ్చు.కుజుడు ఉచ్ఛ కనుక తల్లిగారి ఇల్లుగాని, స్థలంలోగాని ఉండును మరియు తండ్రి సమాజం ఉచ్ఛస్థితికి, ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొనడం జరుగును.

**చంద్రుడు కుంభం :**

చంద్రుడు కుంభం రాశిలో ఉండుట వలన జాతకుడు, పరిశీలనలపట్ల ఎక్కువ అభిలాష, కుంభంకు, సప్తమం సింహం కనుక సమాజంలో ప్రముఖ వ్యక్తులతో పరిచయాలు చంద్రుడు తర్వాత ప్రవేశించు రాశి మీనం కనుక జాతకుడు మీనంలో బుధునకు సంబంధించిన సమస్యలు, ఎదుర్కొనటం జరుగును.

**చంద్రుడు మీనం :**

చంద్రుడు మీనం రాశిలో ఉండగ జాతకుడు ధనస్సు ఉన్న ఎక్కువ లక్షణాలు మనం గమనించవచ్చు. కాని ధనస్సు తర్వాత రాశిలో కుజుడు ఉచ్ఛ మీనం యొక్క తర్వాతి కుజుని క్షేత్రం అయినప్పటికి మేషంలో శని నీచుడు కనుక జాతకుడు వృత్తి వలన ఎక్కువ ఇబ్బందులు, అధిక ఉష్ణము వలన జలుబు, నెమ్ము వలన సమస్యలు కలిగిఉండును. మనకు సప్తమం కన్య కావున దానికి గురుడు అధిపతి కావున జాతకుని ఎక్కువ ఆలోచించుట మరియు, చంద్రుడు నీచ క్షేత్రంలో ఉండుట వలన, నరాల బలహీనత, భుజాల సమస్యలు, చర్మ సమస్యలు, కనిష్ట సోదరి లేక సోదరుల జీవితంలో సమస్యలతో బాధపడటం మనం చూడవచ్చు.

వివిధ గ్రహాలలో చంద్రుని కలయిక వలన ఎటువంటి లక్షణాలు ఉండునో మనం క్రింది విధంగా చూడవచ్చు.

**చంద్రుడు, రవితో :**

చంద్రుడు, రవితో ఉండుటవలన జాతకుని మనస్సునకు తల్లికి రవి క్షత్రియుడు కనుక క్షత్రియునికి సంబంధించిన భావనలు ఏర్పడును. జాతకుడు ఖర్చును నియంత్రించలేకపోవును. జాతకుని అమావాస్య యోగం జాతకుని వరించును. తండ్రి అధిక ప్రమాణములు చేయును.

**చంద్రుడు కుజునితో :**

చంద్రుడు కుజుడు కలయిక ఎక్కువ. జాతకుడు ఎక్కువ ప్రయాణములు చేయుట, అమ్మగారు ఎక్కువ ప్రమాదకర పరిస్థితులు ఎదురించుట జరుగును మరియు సరియైన నిర్ణయం లేకపోవుట మరియు మొండితనము వలన అనుమానం గూడ పెరుగును. మరియు మొండితనం జాతకుని చివరివరకు వెంటాడును. దుష్టులతోను, మంచి మనసులేని వ్యక్తులతో పరిచయాలు సంబంధించిన సమస్యలు కలుగును.

**చంద్రుడు బుధునితో :**

చంద్రుడు అనగా మోసగాడు. బుధుడు అనగా తెలివిగలవాడు. కనుక ఈ ఇద్దరు కలిసిన జాతకుడు ఈ గుణములలో తొందరగ ఏవిషయమునైనా నేర్చుకొనుట, ఆడవారిని ఆకర్షించుట, ఇది నీచమైన కామంకు దారి తీయును. దానికి కారణం బుధుని పుట్టుక చంద్రుని వలన జరిగింది. ఉదాహరణకు చెప్పులు కరుచుట. ఈ కలయిక వలన తండ్రి గారి ఆస్తి మోసపూరితంగా జాతకుడు అపహరించబడును. జాతకుడు మామగారి దగ్గర, స్నేహితుల ద్వారా మోసపోవుట, నీలాపనిందలు పొందుట జరుగును.

**చంద్రుడు గురువులో :**

చంద్రుడు గురువులో ఉండుట వలన జాతకుడు వృత్తి రీత్యా ప్రయాణాలు ఎక్కువ ధన సంపాదన, మంచి ఆలోచన మనసు, తల్లిగారికి దైవంమీద ఎక్కువ నమ్మకం కల్గిన స్వబావం కలిగి ఉండును. దానిని మనం గజకేసరి యోగంతో వర్ణిస్తాము. అనగా చంద్రుడు అనగా పార్వతితో అని గురువు అనగా గజము అని అంటే ఎక్కువ శక్తి గలవాడు. కావున శత్రువుల మీద విజయం గలవాడు. జాతకుడు విదేశాల లో స్థిరపడు అవకాశం, పుట్టిన సమయంలో ఎక్కువగా అనారోగ్యంతో మనం గమనించవచ్చు.

**చంద్రుడు శుక్రునితో :**

జాతకునికి అనుమానం అనే వ్యాధి కలిగి ఉండును. జాతకుని తల్లి తన జాతకం లో సిరిసంపదలు కలిగి ఉండును. భార్య దూరపు సంభంధం కలిగినది. మరియు అక్క, కోడలు భార్య ఎక్కువ అనారోగ్యము, తక్కువ సుఖములు నీలాపనిందలు. మరియు జాతకుడు భార్య కన్న జాతకుని భార్య, సోదరి జాతకుని పట్ల ఎక్కువ అభిమానము కలిగినది అయిఉండును. జాతకుడు ఎక్కువ అప్పులు చేయడం అవి తీర్చలేకపోవడం మనం చూడవచ్చు.

**చంద్రుడు శనితో :**

జాతకుడు వృత్తి, రీత్యా ప్రయాణాలు, అవమానాలు పడును. జాతకుడు శని ప్రభావంచే మనసును స్థిరపరచుకొనలేక ఇబ్బందిపడును. జాతకుడు ఎక్కువగా తినడం మరియు పడుకొనుట యందు ఆసక్తి కనబరుచును. జాతకుని జీవితమునకు సంబందించిన సమస్యలు ఎక్కువగా మనం చూడవచ్చు.

**చంద్రుడు రాహువుతో:**

జాతకుని తల్లి తన చిన్నతనంలో చాలా ఇబ్బందులు ఎదుర్కొని పైకి వచ్చును. జాతకుని నాన్న చాలాదూరం ప్రపంచం నుంచి వలస వచ్చి ఉండును. జాతకుడు భయం, భ్రాంతిలకు లోను అవటం మనం చూడవచ్చు. జాతకుడు పుట్టిన ప్రదేశంలో ఒక బావిగాని, మరియు మురికి కాలువను మనం గమనించవచ్చు. ఈ గ్రహాల కలయికకు గురువు చూపులేనిచో జాతకుని మతిభ్రమించు అవకాశము ఎక్కువ ఉన్నది.

**చంద్రుడు కేతువుతో :**

జాతకుని అమ్మమ్మ గారు ఎక్కువ దైవ భక్తి గలిగి ఉండుట, జాతకుడు పుట్టిన ప్రదేశంలో అమ్మవారి యొక్క గుడి ఉండటం జాతకుని తల్లిగారు మానసిక సంబంధమైన చదువులు బయట అభ్యసించినప్పటికి అందులో నిష్ణాతురాలు అగుచు జాతకుని మనసు ఎల్లవేళల జీవితం కొరకు అన్ని బంధములను వదలి వేయవలలెననే వాంఛ కలిగిఉండును.

**కుజుడు :**

కుజుడు జాతకునికి ఈర్ష, శౌర్యపరాక్రమమును, కామ శక్తిని, లోభమును, వెంటనే పుట్టిన సోదరునకు, అగ్నికి, వేడికి, పళ్ళను, కష్టమును, కష్టములను ఎదుర్కొనుటకు శక్తిని, రక్తమును, ఆడవారి జాతకములో భర్తిను పిన తండ్రికి మనకు జాతకములో తెలియజేయును. కుజుడు శక్తి వాడు కావున బుధునికి శత్రువు, కోప స్వభావం కావున అయిన శనికి శత్రువు ఉన్నది ఉన్నట్లు చెప్పు స్వభావం వలన జాతకునికి శత్రువు, ఆడవారితో సరియైన ప్రవర్తిన లేని గుణం తన యొక్క దేహం కు మాత్రం శ్రద్ధవహించుట శుక్రునికి కుజునికి వైరం మనం చూడవచ్చు.

**మేషంలో కుజుడు :**

కుజుడు మేషరాశిలో స్వక్షేత్రము మరియు మూలత్రికోణం, కేంద్రంలో రవికి అనగా రాజు ఉచ్ఛస్థితి వలన జాతకుడు రాజయోగి లక్షణాలు, మంచి స్థితిని పొందుట, సమాజంలో గొప్ప స్థితి ఉండు వారిలో స్నేహసంబంధాలు కలిగి ఉండుట. ఇది యంత్రములకు సంబంధించిన ఇల్లు కావున జాతకుడు యంత్రములకు సంబంధించిన వాటితో ఆదాయం పొందుఅవకాశం, ఈ ప్రదేశంలో శని నీచ కావున తన కన్న తక్కువ స్థాయి వారితో సేవకులతోను విభేదం, ఇబ్బందులు మనం చూడవచ్చు.

**కుజుడు వృషభరాశిలో :**

కుజుడు ఈ రాశిలో ఉండగా జాతకునకు మధ్యరకం అయిన పొడవు శరీరము కలవాడు, స్త్రీ జాతకంలో చక్కనైన నడవడిక కలిసిన భర్త. ఈ క్షేత్రంలో చంద్రుడు ఉచ్ఛ అనగా ఊహాశక్తి, రాహు ఉచ్ఛ కావున మోసపూరితమైన ఆలోచనలు, ప్రక్కన మిధునరాశిలోకి బుధుని నపకారం వలన జాతకుడు తన ఆలోచనను కార్యరూపం పెట్టి పరిస్థితులు మనం చూడవచ్చు. ఇది శుక్రుని రాశి మరియు సహజ కుటుంబం స్థానం కావున జాతకుని కుటుంబంలో కలహాలు ఇంటి వలన సమస్యలు ఏర్పడును.

**కుజుడు మిధునంలో :**

మిధునంలో కుజుడు కొంత పిరికివాడని చెప్పవచ్చు. ఎందుకనగా వెనుకరాశిలో చంద్రుడు ఉచ్ఛ తర్వాత రాశి చంద్రుడి స్వక్షేత్రం వలన జాతకుడు, నిర్ణయాలు తీసుకొనుటలో ఇబ్బంది పడుట చూడవచ్చు. స్త్రీ జాతకంలో భర్త చాలా తెలివిగల వ్యక్తి, అని మనం చెప్పవచ్చు. భర్తకు కర్కాట రాశిని గురువు ఉచ్ఛ వలన ఆదాయము సంపద సమకూరునని మనము చెప్పవచ్చు.

**కుజుడు కర్కాటకంలో :**

కుజుడు కర్కాటరాశిలో పొగడరి, మేకపోతు గాంభీర్యం ప్రదర్శించువాడు, నల్లని రంగు గలవాడు, ఆడవారి జాతకంలో గుండ్రని ముఖం కలవారు అయి ఉండును. ఇతని జాతకంలో భర్తకు ఎక్కువగా భయపడు స్వబావం కలిగినవారు అయి ఉండును. సరియైన నిర్ణయం తీసుకోలేని వ్యక్తిగా అన్ని పనులలో అవమానములు ఎదురగు లక్షణాలు ఉండును.

**కుజుడు సింహంలో :**

కుజుడు సింహరాశిలో అందమైన శరీరం కలిగినవారు, పొగరుగల వ్యక్తి, మరియు వాహన ప్రమాదములు ఎదుర్కొను వ్యక్తిగాము  నీచ గుణములు కలిగిన చర్య పొందువానిగ, ప్రభుత్వ సంభంధిత వ్యక్తులు సంబంధములు కలిగి ఉండుట,అధిక ఉష్ణము సంభంధించిన సమస్యలు జాతకుడు ఎదుర్కొనవచ్చు.

**కుజుడు కన్యలో :**

కుజుడు కన్యారాశిలో ఉండుట వలన జాతకుడు చర్మసంభంధమైన సమస్యలు, కడుపునకు సంబంధించిన సమస్యలు, నరాల బలహీనత, జాతకుని తమ్ముడు తన యొక్క తెలివి తేటలద్వారా ధనంను సంపాదించుట జరుగును. జాతకుడు భుధుని యొక్క రాశి ఉండుట వలన బుధుడు దృఢమైన శరీరం కలవాడు కావున జాతకుడు లావుగ ఉండు శరీరం ఏర్పడును. మరియు వృత్తిలో ఎక్కువ స్థాయికి చేరు అవకాశాలు జాతకునకు ఏర్పడును.

**కుజుడు తులలో :**

కుజుడు తులారాశిలో ఉండుట వలన తులరాశి శుక్రుని సంబంధించినరాశి మరియు సిరి సంపదలకు అధిపతి అయిన లక్ష్మీదేవి శుక్రునికి అధిపతి కావున జాతకుడు ఎల్లవేళల ధనం పట్ల వ్యామోహం ఉండును. జాతకుడుకి ఆర్థిక సంభంధ లావాదేవీలతో ఎక్కువ ప్రావీణ్యం ఉండుట, తులరాశి భ చక్రంలో వివాహ స్థానం కావున సంసారంలో ఎక్కువ ఆటుపోట్లు మనం గమనించవచ్చు. మరియు అత్తా, కోడలు జాతకుని మధ్య సఖ్యత లోపించును.

**కుజుడు వృశ్చికంలో :**

కుజుడు వృశ్చికంలో ఉండుట వలన జాతకుడు ఎక్కువగాకోపం చెందు స్వభావం, మొండితనం, మరియు నిధులకు సంబంధించిన వృత్తులు, పనులను చేయవలెననే అభిలాష. జాతకుని స్థలములై వివాదాలు, జాతకుని పంటి సమస్యలు, సోదరుల వైరం ను ఎక్కువ స్థిరం చేయుట మనం చూడవచ్చు. ఆడవారి సుఖం కొరకు ఎక్కువ వివాహాలు జరుగుట ఇబ్బంది పడుట మనం చూడవచ్చు.

**కుజుడు ధనస్సులో :**

కుజుడు ధనస్సురాశిలో చక్కనిశరీర శౌష్టవం, కొంతలావు, దైవభక్తి, భుదుని సంబంధించిన వ్యాధులు, అన్నిరకాల బోగములను అనుభవించువాడు అగును. ఆడవారి జాతకములో కుజుడు అనగా భర్తకు, తర్వాత పుట్టిన సోదరునకు పై లక్షణమును తర్వాతి క్షేత్రం, మనకు ఇక్కడ కుజుడు ఉచ్చ కనుక మనం జాతకుడికి సంభంధించన పరాక్రమాలు పోరాటపటిమలు, కామశక్తి మొదలగునవి జాతకునికి పరిపూర్ణంగా లభించును.

**కుజుడు మకరరాశిలో :**

ఈ క్షేత్రంలో కుజుడు ఉచ్చను పొందిన క్షేత్రము కావున మకరంలో కుజుడున్న జాతకులు క్రీడాకారులుగాను, మల్లయోధులుగాను, మకరం నుంచి సప్తమము కర్కాటకము అయిననందు వలన వీరికి ప్రయాణముల పట్ల మక్కువ ఎక్కువ. ఆడవారి జాతకంలో కుజుడు భర్తకారకుడు కనుక భర్త ఉచ్ఛస్థితిలో ఉండును.

ఉదా: జాతకురాలు యాచక వృత్తిలో ఉండినను తనతో ఉన్న పది లక్షలమంది యాచకులనకు అధిపతి అయిఉండును. భర్తకు అనుమానము ఎక్కువగా ఉండును. ఈయొక్క అనుమానం వల్ల కూతురి జీవితంలో ఎక్కువ కలతలు ఏర్పడి వేరే వివాహం ఏర్పడుటకు తోడ్పడును. ఈ జాతకంలో పిత్తమునకు సమస్యలుండును.

**కుజుడు కుంభరాశి :**

ఈ జాతకంలో కుజుడు కుంభరాశిలో ఉండుట వలన జాతకుడు మెత్తగా, అమాయకుడిగా కనిపించి పరిస్థితుల వలన జాతకుడు క్రోధము, ఆవేశమునకు లోను అవును. కుంభానికి సప్తమము సింహము అగుట

వలన జాతకునికి ఉదారగుణం ఎక్కువ ఉండును. ఆడవారి జాతకంలో కుజుడు భర్తకారకుడు కనుక భర్తకు గంభీరము, అందము, రాజరిక లక్షణములు ఉన్న వ్యక్తి లభించును. కుంభము తరువాత క్షేత్రం మీనం గనుక స్త్రీల వలన ఎక్కువ ఆదాయం మరియు కోర్టు వివాదాలు ఏర్పడటం మనం గమనించవచ్చు.

**కుజుడు మీనం :**

ఈ క్షేత్రం గురువుకు సంబంధించిన క్షేత్రం గనుక జాతకుడు పవిత్రుడు. జాతకుడు పరులకు ఉపకారం చేయక పోయినా అపకారం చేయడు. ఆడవారి జాతకంలో అయితే భర్త ఉత్తర దిక్కునుంచి, వేదమంత్రాలు పఠించుగాను మనకు గోచరించును. ఇతనికి ఉమ్మడి కుటుంబం ఉండును. ఈ క్షేత్రం బుధుడు నీచ పొందుట వలన వృత్తిలోను విద్యాభ్యాసంలోను ఆటంకములు మనం చూడవచ్చు.

**కుజుడు వివిధ గ్రహాల కలయిక వల్ల ఏర్పడు ఫలితాలు :**

**కుజుడు, రవి :**

రవి, కుజులకు ఎటువంటి ఫలితాలుడునో కుజ, రవిలకు అటువంటి ఫలితాలుండును.

**కుజ, చంద్రుడు :**

చంద్ర, కుజులకు ఎటువంటి ఫలితాలుండునో కుజ, చంద్రులకు అటువంటి ఫలితాలుండును.

**కుజ, బుధుడు :**

కుజ, బుధ కలయిక వలన విద్యాభ్యాసంలో భూమి వ్యవహారంలోను, కనిష్టలయందు వివాదములు ఏర్పడును. వీరికి యంత్ర సంబంధం అయిన విద్య ఏర్పడును. వీరికి ఒక ప్రేమ వ్యవహారం దెబ్బతినును.

**కుజ, గురువు :**

కుజ, గురువు ఇద్దరు మిత్రులు, కావున వీరికి సంపద, అధికారం, ఒప్పులేనితనం, నాయకుని లక్షణం, అధిక కోపము, మొండితనం ఉండును.

ఉదా : జాతకుని చేతిలో డబ్బు ఉంటే ఖర్చు పెట్టేవరకు నిద్రపట్టదు. ఇతను మనస్సు మార్చుకోవాలని ఎన్ని పూజలు చేసిన వ్యర్థమే.

**కుజ, శుక్రుడు :**

కుజ, శుక్రుడుల వలన భార్య జాతకంలో ఒక్క సోదరుడు తప్పనిసరిగా ఉండడం మనం చూడవచ్చు. భార్య మొండి దానిగా, కఠినమనస్సున్నదానిగా మనం చూడవచ్చు. భార్య తమ్ముడు నీచమైన ఆడవారితో సంపర్కం చేసి తత్ద్వారా సుఖాన్ని పొందుతాడు. ఈ జాతకురాలి భర్త రహ్యాసమైన కళలను పొంది ఉండును.

ఉదా : జ్యోతిషం

ఈ జాతకుడికి పాకశాస్త్రం ప్రావీణ్యం, ఆర్థిక ఇబ్బందులు కలుగును, ఈ రెండు గ్రహముల ఉన్న స్థానం నుంచి గురువు దృష్టి 1,2, కు లేకపోయినా సంసారం బంధము ఇబ్బందికి గురిచేయును.

**కుజ, శని :**

కుజుడు మన జాతకంలో కామశక్తిని, శని వలన సంసారాన్ని వారసత్వాన్ని మనకు తెలియజేస్తాయి. కుజ, శనిలు పరస్పర శత్రువులు. కావున వీరి కలయిక వలన జాతకంలో సంసార సంభంధించిన ఇబ్బందులు కలుగును. ఈ రెండు గ్రహాల కలయిక వలన భూ సంబంధమైన వివాదాలు, వృత్తిలో వివాదాలు, కాళ్ళకు సంబంధించిన సమస్యలు, వాహన ప్రయాణాలు, పంటికి సంబంధించిన సమస్యలు కుజుడు భర్త, సోదరుడు కారకుడు కనుక పై సంభంధించిన లక్షణాలు వీరియొక్క జాతకంలో మనకు గోచరించును.

**కుజుడు రాహువు :**

కుజ, రాహువు వలన జాతకంలో బంధన యోగం ఏర్పడును. వాహన ప్రమాదాలు, రక్తానికి సంబంధించిన సమస్యలు. కుజ, రాహవు + గురువు అయితే చక్కని పోలీస్ అధికారి అవ్వడం. కుజ, రాహువు + శని అయితే క్యాన్సర్ సంబంధించిన సమస్యలు భార్య సంసారసంబంధమైన సమస్యలు. భార్య వృత్తికి సంబంధించిన ఆటంకాలు మామగారికి అనారోగ్యం. కుజుడు భర్త, సోదర కారకుడు కనుక పై సంబంధించిన లక్షణాలు వీరి ఇరువురి జాతకంలో చూడవచ్చు.

**కుజుడు, కేతువు :**

మనకు జాతకంలో శని వత్ రాహువు, కుజ వత్ కేతువు అని చెప్పేవారు.అయినప్పటికీ కేతువు నవగ్రహం అయినా ఫలిత నిర్ధారణ మార్పుఉండును. కుజు భూమి కారకుడు కేతువు విహారానికి కారకుడు కావున భూమిక సంబంధించిన వివాదాలు ఏర్పడడం, స్త్రీ జాతకంలో భర్త సోదరునికి పేరు ప్రఖ్యాతులు కలవారు తమ వెనువంటి ఉండి, వారి భవంతిలో నివసించడం, వాహనములు కలిగి యుండుట, అధిక ఖర్చు, ఆత్మస్థైర్యం లోపించుట, కంటి చూపు ఇబ్బంది మొదలగు సమస్యలు ఏర్పడును.

**బుధుడు వివిధ రాశులలో ఉన్నప్పుడు ఇచ్చు ఫలితం :-**

**బుధుడు వివిధ రాశులలో ఉన్నప్పుడు ఏర్పడు ఫలితం :-**

**బుధుడు మేషరాశి :**

బుధుడు మేషరాశిలో తన శత్రువు అయిన కుజుడు ఇంటిలో ఉన్న మేషరాశి అనగా మీనరాశికి రెండవరాశి అంటే బుధుడు తన నీచమైన ప్రదేశం నుంచి శత్రువు ప్రదేశమునకు వచ్చియున్నాడు. కావున విద్యకు ఆటంకాలు, బుధుడుకు సంబంధించి కారకత్వములు అయిన నరములు, చర్మము, భాగస్వామ్యము, భూమి, కనిష్టలుమొదలగునవి జాతకంలో కొంచెం ఇబ్బంది చేయును. అయినను కుజుడు యంత్ర సంభంధమైన కారకుడు కనుక యంత్రసంభంధం నుంచి ఏ ర్పడును. మేషమునకు రెండు, ఏడు ఇళ్ళు శుక్రుడుకి సంబంధించిందైనా ఇళ్ళు కనుక ఆడవారి నుంచి, సమాజం నుంచి సహాయ సహకారాలు జాతకునికి లభించును.

**వృషభంలో బుధుడు :**

వృషభంలో బుధుడు తన మిత్రుడైన శుక్రుడు ఇంటిలో ఉండును. ఈ రాశిలో బుధుడు విద్యాభ్యాసంలో తెలివితేటలు చూపించకపోయినప్పటికి బ్రతుకు జీవనంలో ఇతని తెలివితేటలు బయటపడును, విద్య మూలకంగా స్థలమార్పు,Physics, Chemistry, English లోతైన విషయాలుతెలుసుకొనుట, అతికామం, పై లక్షణాలు చూడవచ్చు.

**మిధునంలో బుధుడు :**

మిధునం పరాక్రమంకు సంబంధంచినది. ఇందులో బుధుడు స్వక్షేత్రం కావున విద్యాభ్యాసం చక్కని పురో అభివృద్ధి స్త్రీల మూలకంగా ఇబ్బందులు గుప్తరోగములు తన తెలివితేటల ద్వారా సమాజంలో గుర్తింపు, అందరిచేత ప్రశంసలు పొందుట, మాటకారిగా ఉండును. కర్కాటకం తదుపరిరాశి కావున తన విద్యచేత జాతకుడు జనులను ఆకర్షించును. సప్తమం గురువుకు సంబందించిన ఇల్లు కావున జాతకుని విద్య గురువుయొక్క కృపఉండడం దానిని మనం బుద్ధివేశేషిత యోగంగా చెప్పబడుతుంది.

**బుధుడు కర్కాటకము:**

బుధుడు కర్కాటక రాశిలో ఉండువారికి విద్య మూలకముగా వేరొక ప్రదేశంకి వెళ్ళుట, కనిష్ఠ సోదరులకు దూరంకావుట, సోదరుడు ప్రభుత్వ ఉద్యోగం సంపాదించుట, అక్కడ సేవకులతో ఇబ్బందులు, కాళ్ళకు సంబంధించిన సమస్యలు, బుధుడు జాతకులు అందంగా ఉన్న వారితో ప్రేమ వివాహం ఏర్పడును. బుధ, చంద్రులను మనం జాతకంలో అతికామం లేదా తారతమ్యములు లేని కామం చెప్పవచ్చు.

**బుధుడు సింహంలో :**

బుధుడు సింహరాశిలో ఉండగ జాతకుడు రాజరిక, విద్య, వేదవిద్య మీద చక్కని ప్రావీణ్యం, సప్తమం కుంభం కావున విద్యలో అత్యున్నత, ఇతరులు మెచ్చుకోదగ్గపరిస్థితి తరువాతి కేంద్రం బుధుని ఉచ్చకేంద్రం కావున విద్యలు అత్యున్నత స్థాయి, స్త్రీమూలకంగా ఇబ్బంది, స్థళం కలిసి ఉండుట, చలనచిత్రపరిశ్రమలో చక్కని పురోభివృద్ధి, సోదరుడు, అవమానము, నిందలు, దాటివచ్చిన వ్యక్తి అని మనం చెప్పవచ్చు.

**బుధుడు కన్యలో :**

బుధుడు కన్యారాశి ఉచ్చస్థితిలో ఉండును. దీనిని భద్ర పురుష మహాయోగం అని అంటారు. నుదురు వెడల్పును, చివరి వేలుపొడవుగా ఉంగరంవేలు మొదటి కణుపు దాటుట, సోదరునికి స్త్రీసంతానం, కళారంగంలో, కంప్యూటర్ సంబంధించిన విద్య, ద్వితియార్థంలో వెన్నునొప్పి, చర్మరోగాలు, బుజములకు సంబంధించిన సమస్యలు, స్త్రీలకు ఋతు సంబంధం వలన సమస్యలు మనం గమనించవచ్చు.

**బుధుడు తులరాశి :**

బుధుడు తులారాశి మిత్రక్షేత్రంలో ఉండుటవలన, శుక్రుడు మనిషియొక్క తేజస్సుకు కారకుడు కావడం వలన విద్య వలన జాతకుని తెలివితేటలు దానిద్వారా కార్యనిర్వహణ, మంచి ఉద్యోగం కలుగును. కాని ఈ రాశిలో చంద్రుడు ఉచ్చ కావున జాతకుడు విద్య కొరకు అధిక ధనం ఖర్చుపెట్టడం, జాతకుని సోదరుడుదూర ప్రయాణాలు చేయుట, సోదరుడు తల్లికి సేవచేయుట, తరువాతి స్థానం వృశ్చికం కనుక రహస్య విషయాలకు సంబంధించిన సమాచారం త్వరితగతిన సేకరించుట మనం చూడవచ్చు.

**బుధుడు వృశ్చికరాశిలో :**

విద్యకు ఆటంకములు, యంత్ర పరికరములకు సంబంధించినది, సోదరుడు ఉన్నచో యంత్ర విద్య కలిగి ఉండును. జాతకుడునకు విద్యాభ్యసములో కొంత మానసికంగా ఇబ్బందులు, విద్యను భోధించుడంలో ఈ జాతకులకు చక్కని ప్రావిణ్యం, స్థలంకు సంబంధించిన వివాదాలు, జాతకుడు చర్మసంభంధం అయిన రోగాలు, చదివిన విద్యకు వృత్తి వలన సరిఅయిన ఆనందం లేకపోవుట గమనించవచ్చు.

**బుధుడు ధనస్సురాశిలో :**

జాతకునికి వేదాంతం సంభంధించిన విద్యలో చక్కని ప్రావీణ్యం, కనిష్ఠులకు సిరిసంపదలు, నరములు సంబంధనంచిన బలహీనత, భూమికి సంబంధించి వివాదాలు, జాతకుని భార్య ద్వారా చక్కని ఇంటిని గృహప్రవేశము, వాహనాలు, విద్యలో ఆటంకాలు, వాక్కు స్పష్టత.

**బుధుడు మకరరాశిలో :**

ఈ రాశిలో బుధుడు ఉండగా జాతకునికి యంత్ర సంబంధమైన విద్య, విద్యాభ్యాసం కొరకు పుట్టిన ప్రదేశం వదులుట అక్కడ అవమానాలు మరియు కార్యం సఫలం కాకపోవడం. సోదరుడు కుటుంబం వదిలి దూరం ప్రదేశం వెళ్ళుట. కనిష్ఠ సోదరులకు ఆర్థిక ఇబ్బందులు, అవమానములు, తల్లిగారికి పాత భవంతి, స్థలం కలిగి ఉండుట తండ్రిగారు టీచర్‌గాని, జనులు తను చుట్టూ తిరుగు వృత్తి చేయడం మనం చూడవచ్చు.

**బుధుడు కుంభరాశిలో :**

ఈ రాశిలో బుధుడు పరిశోధన స్థానంలో ఉన్నాడని భావించాలి. ఇక్కడ జాతకుడు పదిమంది వ్యక్తులకు ఒక్కమాట ద్వారా సమాధానం ఇచ్చు శక్తిగలవాడు. వీరికి, వీరి సోదరులకు (కనిష్ఠ) ప్రభుత్వ మూలకంగా సహాయ సహకారాలు స్త్రీ మూలకంగా సిరిసంపదలు, సోమరితనం కలిగినుండుట, తండ్రితో విభేధాలు, చక్కని వాక్కు మొదలగునవి మనం గమనించవచ్చు.

**బుధుడు మీనరాశి :**

బుధుడు మీనరాశిలో నీచ గ్రహముగా మనం వర్ణిస్తాము. కావున జాతకుని విద్యలో సాధారణ స్థితి గురించి అత్యున్నతమైన విద్యకు దారితీయు పరిస్థితులు, జాతకునికి విద్యద్వారా సమాజంలో గొప్ప స్థాయి వ్యక్తులతో పరిచయం మరియు సోదరికి సంసారం ఇబ్బందులు భార్య అధిక ఖర్చు చేయు ఉండుట. జాతకునకు యంత్ర సంభంధించిన విద్య ప్రావీణ్యం పెద్దల సహకారం మొదలగున్నవి మనం చూడవచ్చు.

**బుధుడు వివిధ గ్రహాల కలియిక వల్ల వచ్చు ఫలితాలు :**

క్రిందటి అధ్యాయాలో బుధుని కారకత్యములు అయిన విద్యను వివిధ గ్రహాల ద్వారా విశ్లేషణ జరిగింది. బుధుడు మిగత గ్రహాల కరాకత్వములు ఆయా గ్రహం కలయిక వలన వచ్చు ఫలితాలు మనం క్రిందిటి అధ్యాయం ద్వారా తెలుసుకొనవచ్చు.

**గురుగ్రహం :**

జాతకంలో గురుగ్రహం భ చక్రంలోని వివిధరాశులో సంచరించినప్పుడు గురుగ్రహం ఆధారంగా జాతకుని శరీరం, ముక్కు, అరచేతిలోని హృదయరేఖ లేక గురురేఖ మరియు ఆర్థిక స్థితి, మతసంబంధమైన విషయం సమాజంలోని పేరు, కీర్తి ప్రతిష్ఠలు, గౌరవం , రెండవసంతానం, తండ్రి మూడవసోదరుడు తెలుసుకొనవచ్చు.

**గురువు మేషరాశిలో :**

ఈ రాశిలో గురువు తన మిత్రుడైన కుజుడు ఇంట్లో ఉండుట వలన బలిష్టమైన శరీరము ఇదే రాశిలో శని నీచుడు కావడంలో సన్నటి పొడవయిన శరీరం, ఉష్ణము సంబంధించిన సమస్యలు మేషమునకు 2,7 శుక్రుడు సంబంధించిన రాశులు కావున ఆడవారిని ఆకర్షించును.

**గురువు వృషభరాశిలో :**

ఇది శుక్రుడు సంబంధించి రాశి కావున మధ్యరకము కొంత స్థూలకాయము, గుండ్రనిముఖము, వాక్కు చాతుర్యము, అధికారులను ఆకర్షించు శక్తి, ధనకారకులైన గురువు లక్ష్మీకారకుడైన శుక్రుడు ఇంట్లో ఉండుట వలన ధనయోగాలులో ఒక యోగముగా చెప్పవచ్చు. ఈ రాశిలో గురువు తన సన్మోహనశక్తి మాటలలో రాజకీయ నాయకులు, అధికారులను చలన చిత్రములకు సంబంధించిన వారని ఆకట్టుడంలో సిద్ధహస్తుడు. వాతమునకు కారకుడైన శని ఉచ్చ ఉన్నరాశిలో ఉండుట వలన జాతకుని గ్యాస్ట్రిక్ ట్రబుల్ వచ్చును. శ్వాసకోశ సంబంధించిన వ్యాధులు వచ్చును.

**గురువు మిథునంలో :**

మిథునం తెలివితేటలకు అధిపతి అయిన బుధుడు సంబంధించిన రాశి కావడం వలన జాతకుడు తన బుద్ధి బలము మీద ఆధారపడును. బుధుడు వైశ్యుడు కావున జాతకునికి పొట్టరావడం, అరచేతిలో గురురేఖ నుంచి మరొక్కరేఖ బుధస్థాన్నమునుకు అన్నగా చివరి వ్రేలుకు రావడం కర్కాటకం 2వ రాశి కనుక గురువు ఉచ్ఛపొందడం వలన ఆర్థికంగా చక్కని పురోభివృద్ధి జనులకు ప్రీతి పాత్రుడు, ఇతర స్త్రీలతో సంబంధం మొదలైన లక్షణాలు చూడవచ్చు.

**గురువు కర్కాటకం :**

ఈ రాశిలో ఉన్నవారికి పక్షికి ఉన్న ముక్కు, చూచుటకు చక్కని శరీరసౌష్టం, జాతకునికి గురురేఖ, బుధస్థానం నుంచి బయలుదేరి గురుస్థానమునకు అంతం అవడం.నిరంతర విద్యాపఠనం, జనులకు సంబంధం గల విద్యలు అభ్యసించువారు. కఫమునకు సంబంధించిన సమస్యలు, బాల్యంలో చూచుటకు అనాగరికంగా కనిపించినప్పటికీ, సమాజంలో అత్యున్నతమైన స్థాయికి వెళ్ళి తమ విద్యలో సమాజాన్ని సన్నిహితులుచేయగలతరు.

**గురువు సింహరాశి:**

సింహం అంటే సింహం వంటి ముక్కు గలవాడు, రాజరిక లక్షణాలు గంభీరంగా ఉండువాడు. తండ్రి చిన్నతనంలో తన యొక్క సేవలను సమాజంకు అందించుట. జాతకునికి ఒక పురుష సంతానం కలిగి ఉండుట, అధిక ఉష్ణసమస్యలు, నరాల బలహీనత, సమాజంలో గౌరవ వ్యక్తుల కలయిక మరియు సహకారంలో గురురేఖ నుంచి ఒక రేఖ రవి స్థానంలోకి వెళ్ళుట, జాతకుడు రాజు అయినను, జాతకుని తండ్రి బ్రాహ్మణుని వలె సాత్వికుడుఅగును.

**గురుడు కన్య రాశిలో :**

గురువు బుదుడు ఉచ్ఛ ఉన్న రాసిలో ఉండుట వలన జాతకుడు అత్యున్నతమైన తెలివిగలవాడు. కఫ సమస్యలు కలవాడు, మొండివాడు, స్త్రీ వలన భాధింపపడువాడు, తండ్రి సహకారం, అధికారుల సహకారం, లభించిన వాడు. ఆర్థిక సంబంధమైన వ్యక్తులు కలవాడు, చపిమిడి ముక్కు, లావు, మధ్యరకమైన పొడవు, నోరు పెద్దది కలవాడు, పండ్ల ఇబ్బంది కలవాడు, వాహన ప్రమాదం పొంచి ఉండుట, జాతకుని సోదరులతో ఎడబాటు కలిగిఉండుట కుటుంబమునకు సేవ చేయువాడు అగును.

**గురుడు తులారాశిలో :**

తులారాశిలో మధ్యమైన పొడవు, తిండిపట్ల, స్త్రీలపట్ల, దుస్తులపట్ల వ్యామోహం, ఎక్కువ, ప్రయాణం చేయువాడు, ఖర్చుపెట్టువాడు, స్థిరమనస్సులేనివాడు, మొండివాడు, అనారోగ్యమైన తండ్రి, కొడుకు కలిగినవాడు, కఫరోగిగాను, కళ్ళకు సంబంధించిన రోగము కలవాడు, అధికారులు యొక్క సహాయం పొందువాడు అగును.

**గురువు వృశ్చికంలో :**

ఇది కుజునకు సంబంధించిన ప్రదేశం కుజుడు గురువు. ఇక్కడ ఉష్ణంకు సంబంధించిన సమస్యలు, వృత్తిలో సానుకూలత లేకపోవడం, అత్యున్న వ్యక్తుల పరిచయాలు, స్థల వివాదాలు, మోక్షం కొరకు తపించడం, ఆర్థిక వివాదాలు, ఖర్చుపెట్టటకు ఇష్టపడవినవాడు. తల్లితో విభేధించువాడు, రక్త వర్ణ శరీరం కలవాడు, సోదరులు చక్కని ఆర్థిక స్థితి పొందుట, బి.పి అధికం అవుట, మొదలగు సమస్యలు మనం గమనించవచ్చు.భార్య తెలివి కలది అయిఉండును.

**గురువు ధనస్సులో :**

పొడవు అయిన ముక్కు కలవాడు, తేజస్సు కలవాడు, కుజుని కారకత్వలు అయిన స్థలములు, పళ్ళు, ఎముకలు, వివాదాలు మొదలయిన వాటి ద్వారా ధన సంపాదన. భార్య క్రోధం కలదానిగాను, చక్కని కార్య సమర్థత, వివాదాలు, ఆర్థిక అభివృద్ధి తండ్రికి సమాజంలో పేరు ప్రతిష్టలు, సాత్వికత మొదలైనవి మనం గమనించవచ్చు.

**గురువు మకరంలో :**

మిధునరాశి అధిపతి శని కనుక జాతకుడు శనికి సంబంధించిన వాతము, 7వ రాశి చంద్రుడు కావున చంద్రుడు సంబంధించిన కఫము సమస్యలు, ఈ రాశిలో కుజుడు ఉచ్చకనుక, క్రోధము, కండలు తిరిగిన శరీరము, అగ్రజునికి ఆర్థికాభివృద్ధి, వృత్తి నీతి నియమాలుతో పనిచేయుట, జాతకునికి కుజుని వలన నిందలు అనగా బంధువులు స్నేహితులు, అపార్థం చేసుకొనుట గమనించవచ్చు.

**గురువు కుంభంలో :**

కుంభం పరిశోధనకు సంబందించిన రాశి కావున జాతకుడు ఈ రాశిలో పరిశోధన మీద ఆసక్తి, శని సంబంధించిన ఇబ్బందులు, ప్రభుత్వ, రాజకీయనాయకుల సహకారం ఆర్థికంగా ముందు అంజవేయుట, సన్నని పొడవైన శరీరం, కనిష్ఠులు, బంధువులు, స్నేహితులు ధనదాహం కలిసిన వ్యక్తులుగా మనం గమనించవచ్చు.

**గురువు మీనంలో :**

మీనరాశి జాతకునికి స్వక్షేత్రం. కావున జాతకుడు ఇక్కడ వేద శాస్త్రములకు, మతమునకు సంభంధించిన చదువుల మీద ఆసక్తి, మోక్షం కొరకు ప్రాకులాడుట, చెవికి, చర్మంకు, భుజంకు సంబంధించిన సమస్యలు మనం గమనించవచ్చు.

## గురు గ్రహం వివిధ గ్రహాల కలియిక వలన ఇచ్చు వివరాలు :

**గురువు – రవి :**

గురువు రవి కలయిక వలన జాతకుడు కొంత ఉద్రేకం కలవాడు, రాజువంటి లక్షణములు కలవాడు, ఉదారస్వభావం కలవాడు, తండ్రి సాత్విక స్వభావంగాను, సోదరులు సోమరులుగాను, భార్య అనారోగ్యంగాను నిర్ణయం త్వరితగతిన తీసుకోలేకపోవుట మొదలగునవి మనం చూడవచ్చు.

**గురువు – చంద్ర :**

(చంద్ర – గురువు ఫలితాలు చూడండి)

**గురువు – కుజ :**

(కుజ – గురువు ఫలితాలు చూడండి)

**గురువు – బుధ :**

(బుధ – గురువు ఫలితాలు చూడండి)

**గురువు – శుక్రుడు :**

(ధన యోగంకు సంబంధించిన అధ్యాయాలు చూడండి)

**గురువు – శని :**

(వృత్తికి సంభంధించిన ఆధ్యాయంలో ఫలితాలు చూడండి)

**గురువు – రాహువు:**

(విదేశీయోగం సంబంధించిన అధ్యాయాలు చూడండి)

**గురువు – కేతువు :**

(మోక్షం యోగంలోని అధ్యాయం చూడండి)

**శుక్రుడు వివిధ రాశులలో ఉండగా ఏర్పడు పరిచయాలు :**

శుక్రుడు స్త్రీలకు జనకారకుడు, అక్కను, భార్య, కోడలిని సూచించువాడు, సుఖసంపదలకు కారకుడు. సుఖమునకు , సిరి సంపదలకు వాహనములు, గృహమునకు కారకుడు, శౌర్యమునకు కారకుడు, చక్కెరవ్యాధికి, మూత్రపిండములలో ప్రవహించు రక్తమునకు కారకుడు.

**శుక్రుడు మేషరాశిలో :**

మేషరాశి అనగా చక్రవర్తి స్థానము. ఈ రాశిలో శుక్రుడు ఉంటే ఆడవారి జాతకంలో కళాకారుల వంటిముఖం, చూచుటకు ఆకర్షించు రూపము, తక్కువశ్రమ ఎక్కువ ధనసంపాదన, మంచి కుటుంబం, ఆర్థిక స్థితి నుంచి వచ్చుట, ఉష్ణ సంబంధం అయిన వ్యాధులు, కాళ్ళకు సంభంధించిన సమస్యలు, మానసికంగా ఒత్తిడులను ఎదుర్కొనలేకపోవుట లక్షణాలు చూడవచ్చు.

**శుక్రుడు వృషభరాశిలో :**

శుక్రుడు వృషభరాశిలో స్వస్థానంలో ఉంటాడు. రాజరికం, చక్కని ఆర్థిక స్థితి, వాహనం, ఇల్లు, సోదరి, స్త్రీ జాతకంలో గుండ్రని ముఖం ఆకట్టుకోగల రూపం, ఖర్చు ఎక్కువ పెట్టుట, తండ్రికి కొంచెం ఇబ్బందులు, భవంతులలో నివసించుట, వాహనములలో సంచరించుట, వాక్చాతుర్యం కళలలో ప్రావీణ్యం. వీరి ఇంటిలో చంద్రుడు ఉచ్ఛగా వున్న తల్లి, ఉచ్ఛగాను, ఇంటి పైన వారి యొక్క ప్రభావం ఉండును.

**శుక్రుడు మిధునం :**

కొంతలావుగల జాతకురాలు, ఖర్చు పెట్టుట, జాతకుని యొక్క తెలివితేటలు సమాజంలో ప్రవేశించి తద్వారా వారి మన్ననలు పొందును. కూతుర్లు చాలా సున్నిత స్వభావం కలవారు, వ్యాపారం చేయడంలో సిద్ధహస్తుడు, చక్కని ధన సంపాదన, మగవారికి వచ్చుభార్య కొంత అన్ని నాకు మాత్రమే చెందాలి అను స్వభావం ఉండును.

**శుక్రుడు కర్కాటకం :**

శుక్రుడు కర్కాటకంలో  వుండుట యొక్క శక్తి కలుగుట, భార్య చక్కని ధనసంపాదన, అనారోగ్యం, రెండవ కర్కాటకం అనగా సింహం దాని సంభంధించినది కావున, దాని ప్రభావం ద్వారా ధన సంపాదన, సప్తమం మకరం సంబంధించినది కావున సేవకుల మీద అధిపతి అవ్వడం, చంద్రుడు ఇల్లు కావున అత్తగారితో వారికి సరిఐన సంబంధాలు లేకపోవుట మొదలగునవి జరగవచ్చు. చంద్రుడు యొక్క రాశి కావున ప్రతి  పనిలో అనుమానం, అబద్రత, రాశిలో కుజుడు బుధుడు శత్రువు కావున, కుజునికి బుధుడు సంబంధించిన సమస్యలు మనం చూడవచ్చు.

**శుక్రుడు సింహంలో :**

శుక్రుడు రాజ్యంలో ఉండుట వలన, ప్రభుత్వం వలన, స్నేహితుల వలన సహకారం, కఠిన పద్ధతులు, కుమారుడు చాలా పేరుప్రతిష్ఠలు గల కుటుంబంలోకి వెళ్ళుట, అదేవిధంగా చెల్లెలును మనం చూడవచ్చు. రెండవది కన్య కావున ఈ రాశిలో బుధుడు స్వక్షేత్రం, ఉచ్ఛ క్షేత్రం కావున జాతకులకు ఇతరులను ఆకర్షించు తెలివితేటలు, వాహనం, సేవ చేయు స్వభావం మనం చూడవచ్చు.

**శుక్రుడు – కన్యలో :**

శుక్రుడు ఈ స్థానంలో నీచ పొందినవాడు. కావున జాతకుడు గురుచూపుకాకపోయిన జాతకంలో భార్య వలన సుఖవంతంగాను, దూరం అగుట, అనారోగ్యం, వాక్దోషము, లావుకావడం, మాయా మోహములో ఉండుట, మానసిక బలం లేకపోవుట, తరువాతి రాశి తుల కావున జాతకుడు  ద్వితీయార్థంలో ఈ లక్షణాలు మాసిపోయి సుఖంగా ఉండుట జరుగును.

**శుక్రుడు తులలో :**

శుక్రుడు తలరాశిలో స్వక్షేత్రం ఉండు కావున జారవంతుడు, కొంతకోపం, చక్కని ఉత్సాహం, వాహనాలు, ఇల్లు అవసరంకు మించి ఖర్చుపెట్టుట, చక్కని ఆర్థికస్థితిని మనం చూడవచ్చు. కాని చంద్రుడు శుక్రుడు ఇంటిలో ఉచ్ఛకావున త్వరపడి మాట్లాడు స్వభావం, కాని తనవారు బాగుండుటకు ఎక్కువ కృషి చేయడం చూడవచ్చు.

**శుక్రుడు వృశ్చికంలో:**

వాని జాతకం ప్రకారం పితామహుని బిడ్డ చనిపోవుఅవకాశాలు, పాలు లేకపోవుట, ఉష్ణమునకు సంబంధ సమస్యలు, స్థల వివాదాలు, ఇంటి వివాదాలు, కుజుడు ఇంటిలో శని నీచుడు కావున భార్యకు కళ్ళకు సంబంధించిన సమస్యలు, సన్నని శరీరం, రెండవస్థానం గురువు కావున దానిలో శుక్రుడు ఉఛ్చాది జీవితం పై ప్రభావాలు చాలా ద్వితీయార్థంలో మనం గ్రహించవచ్చు.

**శుక్రుడు ధనస్సులో :**

శుక్రుడు ధనస్సులో ఉన్న జాతకులు చాలా అందం అయినవారు, రెండవ ఇల్లు మకరం కావున వాక్కులో స్పష్టత, జాతకుడు తన భార్యకు కఫమునకు సంబంధించిన అనారోగ్యం, గర్భస్రావములు, విద్యాభ్యాసంలో ఆటంకాలు. వీరికి అరచేతిలో శుక్ర రేఖ వలయం నుంచి గురు రేఖకు మరొక రేఖ పయనించుట. మనిషి చూచుటకు (చంపలు) బుగ్గలు ముక్కుకు దగ్గరగా ఉండుట గమనించవచ్చు.స్త్రీ సంతానం అధికం అగుట అచట గమనించవచ్చు.

**శుక్రుడు – మకరం:**

శుక్రుడు మకరం ఉండుట వలన జాతకురాలు అందంగా ఉండుట, కుజుడు ఉచ్ఛ కనుక ఎర్రని వర్ణము కర్కాటకం, సప్తమరాశి కనుక కఫము, వాతములతో ఇబ్బందిపడుట. వీరు ధనమును ఖర్చుపెట్టేవారు. వీరు ఒక విషయమును చాలా సుదీర్ఘంగా పరిశీలించి నిర్ణయం తీసుకొంటారు. వారు ఎపుడయిన సరియైన నిర్ణయం తీసుకొనక, అనుమానంతో లేనిపోని సమస్యలు తెచ్చిపెట్టుకుంటారు.

**శుక్రుడు – కుంభంలో :**

జాతకులు మధ్యరకము అయిన ఎత్తు, రాజరిక లక్షణాలు, జాతకురాలు అయితే పెండ్లి అయిన 2వ సం॥లోనే చక్కని ఆర్థికంగా ఎదుగడానికి వీలుంటుంది.వారు ప్రధమార్థంలో ఆర్థికంగా కొంత స్థిరత్వం లోపించి ఉండును. కుంభం పరిశీలన స్థానం కనుక, సింహం రాజ్యస్థానం కనుక వారు త్వరపడి మాట్లాడరు మరియు కార్యనిర్వహణలో సిద్ధహస్తులు.

**శుక్రుడు మీనంలో :**

మీనరాశి శుక్రుడు ఉచ్ఛ కనుక దానిని మాలవ్య పురుషయోగం ఏర్పడి యోగం పరిపూర్ణం అనుభవింతురు. సమస్తం బుధ క్షేత్రం కనుక కొంచెం లావుగా ఉండుట, రెండవది కుజక్షేత్రం కనుక కొంత తొందరపాటు మాట, సమాజంలో గౌరవ వ్యక్తులతో సంబంధాలు, కేతువు ప్రభావం వలన ఎక్కువ దైవ భక్తి, బుధుడు నీచ కావున కఠిన మనసు కలిగి ఉండుట ఇతరులను తమవారిగా భావించి తమవారలను ఇతరులుగా భావిస్తారు.

# పంచమ మహాపురుష యోగాలు

కుజ, బుధ, గురు, శుక్ర మరియు శని గ్రహం ఉచ్ఛ స్థితుల కారణముగా ఈ పంచ మహాపురుషయోగాలను చూడాలి.

**రుచిక యోగము :** కుజుని ఉచ్ఛస్థితిగా ఈ యోగము ఏర్పడును. జాతకునికి పోటీలలో నెగ్గుకు రావలసిన లక్షణములు, ధైర్యము, ఐశ్వర్యము, స్వయం కృషిలో అన్ని పొందెదరు. కుజుడు, మేష, వృశ్చిక, మకరములలో ఉండిన ఈ యోగము ఏర్పడును.

**భద్రయోగము :** బుధుని ఉచ్ఛస్థితిగా ఈ యోగము ఏర్పడును. జాతకుని వాక్పటుత్వము, వేద విజ్ఞానములు, దీర్ఘాయుఘను ఉండును. బుధుడు ఉచ్ఛ స్వక్షేత్రములైన కన్య మిధునములలో పొందిన ఈ యోగము ఏర్పడును.

**హింసయోగము :** గురుని ఉచ్ఛస్థితిగా ఈ యోగము ఏర్పడును. మధుర కంఠధ్వని, ధర్మమార్గములో ఉదార స్వభావములో యోగులతో, జ్ఞానులతో మంచి సంభంధ బాంధవ్యములు ఉండును. రాజకీయముగా కూడా మంచి పేరు ఉండును. గురువు ధనస్సు, మీన, కర్కాటక రాశులలో వున్నచో ఈ యోగము ఏర్పడును.

**మాలవ్య యోగము :** శుక్రుని ఉచ్ఛస్థితిగా ఈ యోగము ఏర్పడును. సంగీత సాహిత్యముల యందు విపరీతమైన అభిరుచి ఆకర్షణీయమైన ఆకారము రకరకాల ఆభరణాలు ధరించి మందారం, శుక్రుడు, వృషభ, తుల మీనములలో పొందిన ఈ యోగము ఏర్పడును.

**శశియోగము :** శని ఉచ్ఛస్థితిగా ఈ యోగము ఏర్పడును. శరీర రంగు తగ్గి సన్నగా ఉండి స్వయం కృషిలో వృద్ధి చెంద ఒక గ్రామమునకు అధికారిగా లేదా ఊరిపెద్దగా (అధిపతి, అధ్యక్షుడు) ఉండి శత్రువులను ముప్పుతిప్పలు పెట్టెదరు. శనిగ్రహము మకర, కుంభ, తులరాశులలో ఉన్నచో శశియోగము ఏర్పడును.

**సునఫాయోగము :** చంద్రునుంచి రెండు ఇంటిలో శనిగ్రహం కాకుండా వేరొక గ్రహం ఉన్నదానిని సునఫాయోగం అంటారు. దానివలన జాతకుడు తెలివిగలవాడు, రాజరిక మార్గముల ద్వారా సంపాదించువాడు, రవి ఉన్న అన్యాయమార్గం ద్వారా సంపాదించువాడు.

**అనసా యోగం :** చంద్రుని నుంచి రవిగ్రహం కాకుండా ఏదైనా గ్రహం ఉన్న దానిని అనసా యోగం అందురు. దాని జాతకుడు ఆర్థికంగా, పేరు తెచ్చుకొనుట, రోగం నుంచి త్వరగా కోలుకొనుట, రవి గ్రహం ఉన్న సంపాదన ద్వారా వచ్చు దనంను అన్యాయమైన పనులకు ఖర్చుపెట్టుట.

**కేంద్రదూమ యోగము :** చంద్రునికి ఇరువైపులా ఏ గ్రహం లేకపోటం ను మనం కేంద్రదూప యోగం వల్లిస్తారు. దాని వలన జాతకుడు అన్ని యోగములకు హరించివేయును.

**వేశియోగము :** రవి రెండవ ఇంటి నుండి చంద్రుడు కాక వేరొక గ్రహం ఉండుట. లక్షణాలు: చక్కని చదువు, ఉన్నతస్థితి, మంచి స్థితి లేకపోయినను, వేరొకరికి సహాయపడవలెననే ఆలోచన కలిగి ఉండుట.

**వాశి యోగము :** రవిగ్రహం చంద్రుడు కాకుండా మరొకగ్రహం 12వ ఇంట ఉండుట. సంతానం ఆర్థికంగా ముందుకు ఎదుగుట, సత్‌సంభంధాలు, పిత్రార్జితం మీద ఆధారపడకుండ ఉండుట, చంద్రుడు ఉన్న పిత్రార్జితం ఆశించుట.

**కాలసర్పయోగము / దోషము :**

మనం పురాణాలలో ఈ రాహుకేతువుల గురించి ఒక కథ కలదు. అమృతము కొరకు రాక్షసులు, దేవతలు పాలసముద్రమును చిలుకుచుండగా, అమృతము లభించెను. దాని కొరకు దేవతలు,రాక్షసులు కలహించసాగిరి. అప్పుడు విష్ణువు మోహిని అవతారము ధరించి దేవతలను, రాక్షసులను వేరువేరు వరుసలలో కూర్చుండబెట్టి, అమృాతము సమానముగ అందరికి పంచి పెట్టెదనని చెప్పెను. కాని ముందు దేవతలు కూర్చున్న వరుసలో అమృతము పంచి పెట్టుట మొదలు పెట్టెను. అది స్వర్భాను అను రాక్షసుడు చూచి దేవతల వరుసలో కి వచ్చి కూర్చుండి అమృతమును సేవించెను. ఆవిషయము సూర్య చంద్రులు గుర్తించి, విష్ణువునకు రహస్యముగా తెలియజేసిరి. అప్పుడు శ్రీహరి తన సుదర్శన చక్రముతో రాక్షసుని శిరస్సుఖండించెను. కాని అప్పటికే ఆ రాక్షసుడు అమృతము సేవించెను. ఆ రాక్షసుని తల సుదర్శన చక్రముచే ఖండింపబడినను అమృతము వలన తల, మొండెములు రెండు చనిపోక అమరములై రాహు, కేతువులలో పేర్లుతో నిలిచిపోయిరి. అది లగాయితు ఆ రాహు కేతువులు, సూర్య, చంద్రులపై పగబట్టి సూర్య, చంద్రులను మ్రింగుటకు ప్రయత్నము చేయుచుండిరి. గ్రహణము రోజున రాహు, కేతువులను వేధించుచున్నారు.

రాహుకేతువుల మధ్య అన్ని గ్రహములు బంధించబడుట, లేదా కేతు రాహుల మధ్య అన్ని గ్రహములు బంధించబడుటను కాల సర్పదోషంగా వర్ణిస్థారు. కాని నేడు ప్రముఖ రాజకీయ నాయకుల జాతకములు చూచిన ఎక్కువగా ఇటువంటి కోవకు సంబంధినిచినవిగా మనం పేర్కొనవచ్చు. రాహు, కేతువులు ఏవిధంగా మనం గ్రహములను బంధించి, ఇబ్బందులకు గురిచేయునో ఈ క్రింది విధంగా చూడవచ్చు.

ఉదా. 1:

| | | | |
|---|---|---|---|
| | చం | కు | శు |
| కే | | | గు,బు, ర |
| | | | రా |
| | | | |

పై జాతకము రాహు, కేతువు మధ్య, గ్రహములు బంధి అయినవి అని చెప్పవచ్చు.

ఉదా. 2 :

| | | | |
|---|---|---|---|
| | | కు | శు |
| కే | | | గు,బు, ర |
| చం | | | రా |
| | | | |

పై జాతకంలో చంద్రుడు రాహు, కేతువుల నుండి బయటకి వచ్చినటు కనుక ఈ జాతకము కాలసర్పదోషము లేదు అని చెప్పుటకు వీలులేదు. ఎందుకు అనగా చంద్రుడు రాహు, కేతులనుంచి బయటకు వచ్చినాడు. కావున జాతకంలో జాతకుని తల్లి, తనవారినుంచి బయటకి వచ్చి నివసించవలసిన పరిస్థితి ఏర్పడును.

ఎందుకనగా ఒక గ్రహం జాతకములో మిగతా గ్రహములో కలవక బయటకు వచ్చినది అంటే దానికి ఒక అర్థం ఉంటుంది.

ఉదా. 3 :

| | | | |
|---|---|---|---|
| | | కు | శుబ గు |
| కే | | | శ |
| చం | | | రా |
| | | | |

పై జాతకము చంద్రుడు బయటకు కనిపించును. పరివర్తనయోగం వల్ల శని తన స్వక్షేత్రంకు, చంద్రుడు తన స్వక్షేత్రంకు వచ్చును. అందువలన శని తన స్వక్షేత్రంకు వచ్చి ఒంటరివాడు అయినాడు కాబట్టి జాతకుని అన్న కారకుడు అయిన శని ఒంటరిగా వచ్చుట వలన అన్నగారు ఒంటరి అని చెప్పుట శ్రేయస్కరం.

| | | | |
|---|---|---|---|
| | కు | రా | |
| | | | చంద్ర |
| గు | | | |
| | కే | బు,శు,శ | |

రాశి చక్రము కాలసర్పదోషం నుంచి మినహాయింపు ఉన్నదా అని సందేహం పాఠకులకు కలుగును. పై జాతకము ఏవిధంగా పరిశీలించవలెనో ఈ క్రింద వివరించు చున్నాను.

| | | | |
|---|---|---|---|
| ఉత్తరం | తూర్పు | దక్షిణం | పడమర |
| పడమర | | | ఉత్తరం |
| దక్షిణం | | | తూర్పు |
| తూర్పు | ఉత్తరం | పడమర | దక్షిణం |

పై జాతకంలో రాహు, కేతువులు ఏవిధంగా ఇతర గ్రహములు బంధించుట చూడవచ్చు. పై జాతకంలో గురువు దక్షిణంలో ఉన్నాడు. రాహువు దక్షిణంన ఉన్నాడు కనుక జాతకంలో గురువు రాహువు కేతువు నుంచి బంద విముక్తుడు అయ్యాడు.

కుజుడు తూర్పున ఉన్నాడు. రాహువు దక్షిణం ఉన్నాడు అంటే కేతువు, ఉత్తరంలో ఉన్నాడు అంటే కేతువు మీనరాశికి వచ్చును. ఎందుకుఅనగా మనం, కర్కాటకం, వృశ్చికం, కేతు క్షేత్రములు కావున మనం ఈ జాతకంలో కుజుడు బంధిఅయినాడు అని మనం చెప్పవచ్చు. బుధ, శని, శుక్రుడు జాతకంలో పడమర ఉన్నాడు. రాహువు దక్షిణంలో ఉన్నాడు, కేతువు ఉత్తరంలో ఉన్నాడు. కావున ఈ జాతకంలోరాహువు దక్షిణం ప్రదేశం అయిన కన్యకు రాహువు వచ్చినట్లు గా భావించి, జాతకములు శని, బుధ, శుక్రులు కేతు, రాహువుల మధ్య బంది అయినాడు అని చెప్పవచ్చు.

ఈ విధముగా ప్రతి జాతకములు గ్రహములు విడిపించి పలితనిర్ధారణ చేయవలెను. ఫలిత నిర్ధారణ గ్రహానికి 2,12 ఉన్న గ్రహము, వక్ర గ్రహాలు, పరివర్తయోగ గ్రహాలు, వాని నక్షత్రములు పరిశీలించి జాతకం పైన ఫలిత నిర్ధారణ చేయవలసి ఉంటుంది.

**కుజదేషము / నాగదోషము :**

కుజుడు అనగా మంగళుడు. ఈశ్వరుని కొలిచే భక్తుడు. కుజుడుని కుమార స్వామిగాను, విష్ణుమూర్తిని కొలిచే భక్తులు విశ్వవత్‌సేనుడిగా పూజిస్తారు. పై అభిప్రాయ భేధములు ఉన్నప్పటికి ఫలితము ఇచ్చు విషయంలో బేధము లేదు.

ఈ వివాహ విషయంలో కుజుని పాత్ర చాలా ముఖ్యమైనదిగా పేర్కొనవచ్చును. స్త్రీ జాతకంలో కుజుడు భర్తగాను, పురుష జాతకంలో కుజుని కామశక్తిగా వర్ణించవచ్చు. నేడు సమాజంలో కుజదోషము / నాగదోషము అని చాలా రకములైన పుకారులు జాతకుల యొక్క జీవితాలను అస్తవ్యస్తం చేస్తూన్నాయి. నేడు సమాజంలో కుజ దోషముఅనగా గురువు నుంచి (దీని పురుష జాతకంలో లగ్నంగా భావించాలి) గురువు నుంచి, శుక్రుడు నుంచి చంద్రుని నుంచి కుజుడు 1,2,4,7,8,12 ఇల్లలో కుజుడు ఉంటే దాని కుజదోషంగా వర్ణిస్తారు. లగ్నము అనగా తనువు, ద్వీతీయము అనగా వాక్కు, కుటుంబం చతుర్ధం అనగా మానసిక స్థానం, ఇల్లు, గృహస్థ ఆశ్రమం.

సప్తమస్థానం అనగా సమాజ సంబంధాలు భార్యస్థానం. అష్టమము అనగా ఆయుషు, మాంగల్య స్థానం. భార్య జాతకంలో భర్త యొక్క ద్వీతీయం అనగా కుటుంబ స్థానం. వ్యయము అనగా ఖర్చులు శయనా స్థానం. (దంపతులు శయనాస్థానం) గురువు అనగా జాతకుడు. అందువలన గురువు నుంచి 1,2,4,7,12 స్థానాల్లో కుజుడు ఉంటే శరీరం సంబంధించి జాతకుని ఆయాస్థానాల్లో ఇబ్బంది పడును.

చంద్రుడు అనగా మనోకారకుడు అందువలన చంద్రుడు నుంచి 1,2,4,7,8,12 కుజుడు ఉంటే మనస్సుకు సంబంధించే పై చెప్పబడిన కారకత్వాలు.

శుక్రుడు అనగా భార్య కారకుడు. శుక్రుని నుంచి 1,2,4,7,8,12 ఇల్లలో కుజుడు ఉంటే నివాసం సంభంధించి పై కారకృత్వాలు పనిచేయును. కానీ ఈనాడు పైన మూడు గ్రహాలు నుంచి చెప్పేరుగాని మిగతా గ్రహాల నుంచి కుజుడు వలన ప్రవేశాన్ని చెప్పక పోవడం కుజదోషము గురించి మిక్కిలి భయఆందోళనలు కలుగును.

ఉదా: కుజునికి శత్రువు కారకుడైన రాహువు, శని బుధుడు, గ్రహములు నుంచి కుజుడి 1,2,4,7,8,12 ఇళ్ళలో ఉన్నప్పుడు కుజుడు పై సూత్రం ప్రకారం బలహీనుడు అవును.

కుజునుకు 2,12 ఇల్లలో పాప గ్రహము ఉంటే, కుజుడు వక్రించి పాప క్షేత్రంలోనికి వెళ్ళినపుడు, పరివర్తన యోగంలో కుజుడు తన శత్రువు నీచ క్షేత్రాలు వెళ్ళినప్పుడు నక్షత్రంలో వల్ల పరివర్తన యోగం కలిగినప్పుడు కుజుడు యొక్క దాషము హరించును. కుజుడును, శుక్రుడు దాటినప్పుడు గ్రహ యుద్ధంలో శుక్రుడు గెలిచినట్టుగా కుజుని యొక్క శక్తి హీనపడినట్లుగా మనం చెప్పవచ్చు.

| | | | |
|---|---|---|---|
| | | | గురు |
| | | | కుజుడు |
| | | | |
| | చంద్ర | | |

పై చెప్పిన విధానం ప్రకారం గురువు నుంచి, శుక్రుడు నుంచి 2వ ఇంటిలో కుజుడు ఉన్నాడు. కాబట్టి కుజదోషమని చెపుతారు అది పెద్ద పొరపాటు. కానీ మనం ఈ జాతకాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తే కుజ, చంద్రుల పరివర్తన యోగంలో కుజుడు తన స్వచ్ఛక్షేత్రమైన వృశ్చికానికి, చంద్రుడు తన స్వచ్ఛక్షేత్రమైన కర్కాటకానికి పరివర్తన చెందుతారు. ఈ విధమైన పరివర్తన యోగం వలన కుజుడు, గురువు, శుక్రుల నుంచి 6వ ఇంటికి చంద్రుని నుంచి 5వ ఇంటికి మనం కుజుని గమనించాలి అనగా ఈ జాతకం కుజుదోషము హరించునట్లు అవుతుంది. ఈ విధముగా జాతకంలో ఒక గ్రహాన్ని పరిశీలించేటప్పుడు, గ్రహముయొక్క బలము, దృష్టి పరివర్తన, వక్రత్వం, సమాగమము, మిత్ర, స్వక్షేత్ర, ఉచ్ఛక్షేత్ర నీచ్ఛకేత్ర, నీచభంగ రాజయోగములు, గ్రహమునకు ముందు వెనుక ఉన్న గ్రహాలు నక్షత్రంలో గ్రహాల పరివర్తనా మొదలగున్నవి. మనం పరిశీలించి ఫలిత నిర్ధారణ చేయాలి.

**నాగదోషము :**

కేతువు కుజుడుతోగానీ, రవితోగానీ ఇతర గ్రహాలతో కలియుట వచ్చు అవయోగాలు నాగదోషం అంటారు. కొన్ని నాడీ గ్రంథాలలో రాహువు, కుజుడు యొక్క పరస్పర దృష్టి కోణంలో కేంద్రంలో దృష్టి కుజు దోషమని చెప్పి రాసి ఉన్నారు. ఏదీఏమైనను కేతువు, రాహువు పరస్పరం ఒక్కరికి ఒక్కరు 7వ ఇంటిలో ఉంటారు. కాబట్టి పై రెండు వాదములు సమంజసముగా ఉంటాయి. ఈ నాగదోషము వలన జాతకునికి అనేక అవరోధాలు, ఇబ్బందులు, వివాదాలు, యదార్థం తీసుకోలేని పరిస్థితి, కోర్టుకేసులు, సంసార బంధాలు దూరముఅవుట. ఈ విధముగా ఈ రాహుకేతువు కలిస్తే ఆ గ్రహము యొక్క కారకత్వములు ఇబ్బందులకు గురిచేసి జాతకులు మిక్కిలి బాధించును.

ఉదా : గురువు, రాహువులు జాతకులలో కలిసి జాతకులలో మొండివాడుగాను, కఠిన మనస్కుని గానో దూరప్రాంతాలో సంచరించు వ్యక్తిగాము, సదాచారాలు పాటించని వ్యక్తిగాను వర్ణిస్తాము. భ చక్రంలో సహజంగా 7వ స్థానం భార్య స్థానము, వ్యాపారము సామాజిక సంబంధాలు, భార్య సంబంధాలు, తెలియజేయును. రాహువు ఎక్కడ ఉండిననూ రాహువుకు సప్తమంలోకేతువు ఉండును. కేతువు అనగా భార్య కారకుడైన శుక్రుడుకు శత్రువు మరియు మోక్ష కారకుడు, వివాహాలకు కారకుడు. కావున జాతకంలో శుక్రుడు బాగున్నప్పుడు (స్వచ్ఛక్షేత్రం, మిత్రక్షేత్రం, ఉచ్ఛక్షేత్రం) వివాదాలు కొంత వరకు మాత్రమే జరుగుతాయని చెప్పవచ్చు. జాతకంలో శుక్రుడు బాగలేకపోతే పై విధమైనా నాగదోషము ఉన్నప్పుడు జాతకుని సంసారబంధనాలు దూరము చేయును. ఆడవారి జాతకం పరిశీలించేటప్పుడు భర్త స్థానం ఎడమ ఇల్లు దానికి అధిపతి కుజుడు. కుజునికి పరమశత్రువు అయినా

రాహుతో సంబంధం కలిపినా కుజుడికి అన్ని ఇంటా బంధనాలు ఏర్పడి. పురుష జాతకంలో కేతువు. శుక్రుడు ఎటువంటి అవయవరోగాలు వచ్చినా స్త్రీ జాతకంలో కుజుడు, రాహువు అంతకన్నా అవరోధాలు ఇచ్చును. ఈ విధముగా ప్రతి గ్రహానికి రాహు, కేతువుల యుతి కలిగినప్పుడు ఆయాగ్రహాల కారకత్వములు (కలయిక)ఇబ్బందులకు గురిచేయును.

**ఏలినాటిశని :**

| | | | |
|---|---|---|---|
| | | | చంద్రుడు |
| | | | గురువు |
| | | | |
| | | | శని |

శని గోచారమునా ఒక్కరాశి నుంచి మరొక సంచరించుటకు పట్ట సమయం 2½ సంవత్సరం. అందుకే శని మందగ్రహనము అంటారు. (శని కర్కాటకములో పేజీలు వివరించబడినది).

జాతక చక్రంలో చంద్రుడు నుంచి గోచారముగా శని 12,1,2 ఇళ్ళలో సంచరించినప్పుడు దాని ఏలినాటి శనిగాను, 4,8 ఇళ్ళలో సంచరించినప్పుడు అర్థఅష్టమశని, అష్టమ శనిగాను 5వ ఇంటిలో సంచరించినప్పుడు పంచమ శనిగాను, చెబుతారు. చాలా మంది ఏలినాటిశని గురించి చాలా అపోహలు ఉన్నాయి. ఆ అపోహలు వల్ల వారు ప్రశాంతంగా ఉండకుండా తన చుట్టూ ఉన్న వారిని కూడా ఇబ్బందులకు గురిచేయుచున్నారు.

ఉదా: శని కుంటివాడని, గుడ్డివాడని, కార్యములు నాశనము చేయు వ్యక్తి అని, ఉద్యోగం తొలగించు వ్యక్తి అని చాలా అపోహలో ఉంటారు. ఎక్కువ మంది జ్యోతిష్యులు పంచాంగకర్తలు గోచారముగా చంద్రుడు నుంచి శనిని ఇచ్చే చెడుఫలితాలు మాత్రమే వివరించారు. అదే ఏమి అనగా చంద్రుడు నుంచిశని 2వ ఇంట్లో ఉంటే కుటుంబంలో చికాకులు, ధనం నష్టం, వాక్కుదోషం మొదలైనవి చంద్రుడు వలన ఇబ్బందులు కలగుతాయి అని చెబుతారు. చంద్రుడు జాతకంలోనే తల్లికి, అత్తగారికి, మొదటి అక్కకు, అవమానానికి, ప్రయాణానికి , ఖర్చుకు, పాలకు, కయ్యానికి, మనస్సుకు అధిపతిగా ఉంటాడు. కావున ఏలినాటి శనివల్ల పై కార్యకర్తలు మాత్రమే ఇబ్బందులకు గురిగాలవు అందులోను గోచారంలో మిగతా గ్రహాలయినా పరిశీలించి ఫలితం చెప్పాలి గాని త్వరపడి గోచారంలో శని, చంద్రుడుకు ఉండే ప్రదేశము మాత్రమే చూసి చెప్తే ఫలితము ప్రమాదాలకు దారి తీయును. చంద్రుడు నుంచి 12,1,2,4,5,8 శని ఉన్నతంగా వచ్చు ఫలితాలు.

12వ ఇల్లు అనగా వ్యయం, వైద్యము, శయనాసౌఖ్యం భార్య నుంచి ఋణ రోగశత్రువు స్థానం. తల్లి నుంచి 9వ స్థానం. అక్కగారి నుంచి 2వ స్థానం. తండ్రి నుంచి 4వ స్థానం. సోదరినుంచి దశమస్థానం. కావున పై సంబంధించిన విషయాలలో మానసిక సౌఖ్యం (చంద్రుడు మనోకారుడు గనుక) లోపించును.

1వ ఇల్లు అనగా తనువు, శరీరం రక్తం, ఎడమకన్ను, ప్రయాణాలు, ఉద్యోగాలలో బదిలి స్థిరత్వం లేకపోవుట వృత్తిలో నీలాపనిందలు, ఆడవారికి ఋతుసంభంధమైన సమస్యలు మొదలగునవి దీనిట్లో చూడవచ్చు.

2వ ఇల్లు అనగా కుటుంబం, వాక్కు స్త్రీ జాతకంలో భర్త, ధనస్థానం. తండ్రి జాతకంలో 6వ స్థానం (ఋణం, రోగము, శత్రువు) అక్కగారి జాతకంలో 4వ స్థానం, కనిష్టుడు జాతకునిలో వ్యయస్థానం సంబంధించిన కారకత్వాలు ఏలిననాటిశని వల్ల కొంత ఇబ్బంది కలుగును.

4వ ఇల్లు అనగా చదువు, గృహస్థఆశ్రమం, ఛాతి భాగము వాహనము, గృహము, తండ్రిగారికి అష్టమ స్థానము, తల్లిగారికి జన్మస్థానము, కనిష్ఠులకు ద్వితీయం, అగ్రజాలకు షష్ఠం, భార్యకు దశయం పై సంభంధించిన కరాకత్వాలు ఇబ్బంది గురి కావును.

5వ ఇల్లు అనగా సంతానం, విద్యలో ఉన్నతి, యంత్ర స్థానము రాజాగృహము, తండ్రిగారి యొక్క స్వస్థానం భార్యకు 11వస్థానం. తల్లిగారికి ద్వితీయం అగ్రజునికి స్తపమం. కారకత్వంలో శని వల్లకొంత ఇబ్బంది ఏర్పడును.

8వ ఇల్లు అనగా మాంగల్యము, భార్య ధన స్థానం, సోదరులకు పంచమము, భ చక్రంలో తండ్రికి వ్యయము, తల్లికి తృతీయం. రహస్య ప్రదేశమును మొదలగు కారకత్వములు శని వలన దెబ్బతినెను.

గమనిక: పై సంబంధించిన కారకత్వములన్నిటిని మానసికంగా జాతకునికి ఎక్కువగా ఇబ్బంది చేయును.

పై చెప్పబడిన ఉదారహణ జాతక చక్రములో చంద్రుడు మిధునంలో ఉన్నాడు కార్కాటకంలోని శనిగోచారం ప్రకారం వచ్చినప్పుడు, చంద్రుడు నుంచి 2వ ఇంట్లో ఉన్నాడు కాబట్టి ఏలిననాటిశని అని మనం భయపడతాము. కానీ కర్కాటకంలో గురువు గ్రహం ఉన్నది. గురువు ఆర్థిక శాఖ కారకుడు శనివృత్తి కారకుడు. కర్కాటకం చంద్రుడు సంబంధించిన ఇల్లు. కావున వృత్తి రీత్యా ఉన్నతి పదవి కలిగి అందులో ఆదాయం పెరిగి వేరొక ప్రదేశము బదిలి చేయబడును. ఈ విధంగా చంద్రుడు నుంచి మాత్రమే కాక మిగతా గ్రహాలుంచి శనిని చూచినప్పుడు శుభ, అశుభ ఫలితాలు మనకు ఏర్పడుతాయి. కావున ఏలినాటిశని అంటే చంద్రుని సంబంధించినా ఫలితాలు కొంత ఇబ్బందిగాను ఏర్పడును. ఈ విదముగా ప్రతి గ్రహానికి రాశి చక్రములో (గోచారంలో శని సంచరించినప్పుడు) శుభ, అశుభ ఫలితాలు మనం చూడవచ్చు.

**వైద్యజ్యోతిష్యం :**

మన జ్యోతిష్యశాస్త్రము మనకు, ఆయుర్వేదంనకు అవినాభావ సంబంధమున్నది. మానవుని సమస్యలకు ఆయుర్వేదంలో వాతము, పిత్తము, కఫముగా వర్ణించారు. మనకు రాశి చక్రములోని గ్రహలను వాత, పిత్త, కఫములుగా ఈ క్రింది లక్షణాలు చూడవచ్చు.

**పిత్తమునకు సంబంధించిన గ్రహములు :**

రవి, కుజ, కేతువులు

**కఫానికి సంబంధించిన గ్రహములు :**

రాహువు, శుక్ర, చంద్రుడు

**వాతమునకు సంబంధించిన గ్రహములు :**

శని, బుధుడు

(వాతావరణములోని వర్షాలు, చలి గాలి, ఎండలు, ఇవి అన్ని కూడా రవిని ఆధారముగా రవిపై చూడు గ్రహాల యతి దృష్టి ద్వారా వాతవరణములోని విషయాలను కనుగోనడమే కాకుండా మనం భూకంపములో మొదలైన వాటిని కనుగొనవచ్చును)

**1. జలుబుకు సంబంధించిన సమస్యలు :**

మగవారికి జీవకారకుడు గురువు. ఆడవారికి జీవకారకుడు శుక్రుడు. వీరికి కఫమునకు కారకులైన కఫమునకు సంబంధించిన గ్రహాలు యుతి, దృష్టి వలన జాతకునికి కఫమునకు సంబంధించిన సమస్యలు. దీనిలో పాటి వాతమునకు సంబంధించిన గ్రహాలైన శనిగాని, బుధునిగానీ చేరినా జాతకునికి కఫము + శ్వాసకోశ వ్యాధులు వ్యాపించును.

ఉదా :

1. గురువు + రాహువు
2. గురువు + శుక్రుడు
3. గురువు + రాహువు + శని (జీవకారకుడైన గురువుతో పాటి కర్మ కారకుడైన శనికి గ్రహాలు కలయిక లేదా చూపు వలన మనకు వాత, పిత సమస్యలను ఏర్పడును.

**2. కంటికి సంబంధించిన సమస్యలు :**

జాతకంలో కుడి కంటిని రవిగాను, ఎడమకంటిని చంద్రునిగాను పేర్కొంటిరి. కావున రవికి + చంద్రునికి గల శత్రు గ్రహాములు కలయిక లేదా దృష్టి వలన కంటికి సంబంధించిన సమస్యలు ఏర్పడును.

**3. చెవికి సంబంధించిన సమస్యలు :**

చెవికి కారకత్వం అయిన బుధునకు, రాహువునకు వాటి శత్రు గ్రహములు అయిన కుజుడు, కేతువు వలన చెవికి సంబంధించిన సమస్యలు ఏర్పడును.

**4. ముక్కు సమస్యలు :**

జాతకంలో ముక్కును గురుగ్రహంగా చూపుడు వేలును గురుగ్రహంగా వర్ణిస్తారు. ఈ గురు గ్రహంనకు శుభగ్రహముల కలయిక వలన ముక్కు అందంగా,గురువునకు పాప గ్రహములకలయిక, చూపు వక్రముగా వలన ముక్కు అందంగా లేకపోవడం, నాసికకు సంబంధించిన సమస్యలు, ఆర్థిక అస్థిరత్వం కలుగును.

**5. గొంతుకు, చర్మమునకు సంబంధించిన సమస్యలు :**

జాతక చక్రంలో నాలుక, బుధుడు గ్రహంగా వర్ణిస్తారు. కావున బుధగ్రహం చాలా శత్రు గ్రహములు కలయిక, చూపు వలన గొంతుకు సంబందించిన సమస్యలు కలుగును.

**6. రక్తం, పంటికి సంబంధించిన సమస్యలు :**

జాతకములో కుజుదుని పంటికి సంబంధించిన రక్తంకు, ఎముకల పటుత్వం,వెన్నుఎముక వంటి సమస్యలను, దైర్య పరాక్రమములు, ఆడవారి జాతకంలో భర్తను, కనుబొమ్మలను కుజునకు వర్ణిస్తారు. కుజుని శత్రుగ్రహముల కలయిక, చూపువలన పంటికి సంబంధించిన సమస్యలు మరియు రక్తమునకు సంబంధించిన సమస్యలు ఏర్పడును.

**7. ఆయాసం :**

కర్మ కారకుని అయిన శనికిగాని, ధర్మకారకుడు మరియు జన్మ కారకుడు అయిన గురువుకు ఎక్కువ కఫగ్రహములు అయిన శుక్ర, చంద్ర, రాహువుల సంబంధంకలిగిన పై వ్యాధికి సంబంధించిన సమస్యలు మనం గమనించవచ్చు.

**8. హృదయంకు సంబంధించిన సమస్యలు :**

హృదయం కు సంబంధించిన కారకుడు, ఆత్మకారకుడు రవి, ఈ రవిగ్రహంనకు అధిక పిత్తకారకుడు అయిన కుజుడుగాని, కేతువు సంబంధం కలిగి తద్వారా జీవకారకుని గురువునకు గాని, కర్మకారకుడు అయిన శనికి సంబంధం కలిగిన హృదయం సంబంధించిన సమస్యలు ఏర్పడును.

ఉదా: గురువు + రవి + కుజు

గురువు + రవి + కేతు

**9. కీళ్ళకు సంబంధించిన సమస్యలు :**

జీవకారకుడైన గురువునకు కర్మకారకుడైన శనికి ఛాయగ్రహములైన రాహు, కేతువులు సంబంధము కలిగినా, చూడబడినా పై ఇబ్బందులు ఏర్పడును.

**10. చక్కెర వ్యాధి :**

గురువు, శుక్రుడు చక్కెరవ్యాధి కారకులు, జాతకములో గురువు, శుక్రుడుకు పాప గ్రహముల సంబంధము కలిగినా పై లక్షణము ఏర్పడును. కానీ ఫలిత నిర్ధారణలో రక్తమునకు కారకుడైనా చంద్రుడు, మజ్జ, కండ, వ్యాధినిరోధక శక్తి కారకుడై కుజుదుని పరిశీలించి ఫలితనిర్ధారణ చేయాలి.

**11. రాచపుండు :**

జీవకారుకుడుకు అధిక ఉష్ణ కారకులైన కుజ, కేతువుల దృష్టి లేక కలయిక ఏర్పడిపై చెప్పబడిన గ్రహములు వారి శత్రువు గ్రహములలో భాధించబడుతుంటే పై చెప్పబడిన లక్షణాలు ఏర్పడుతాయి.

**12. వెన్నుమొక్క నొప్పి :**

ఎముకలకు కారకుడైన కుజునికి శత్రువు గ్రహములైనా నరాల కారకుడైన బుధుడు, ఉదరమునకు కారకుడైన రాహువు, యతి కలయిక వలన వెన్ను ఎముక నొప్పి వచ్చును.

**13. వాహన ప్రమాదాలు :**

చక్రానికి కారకుడైన రాహువు, యంత్రమునకు కారకుడైన కుజుడు సంబంధం కలిగి ఈ రెండు గ్రహములు కర్మకారకుడైన శనికి గానీ, జీవకారకుడైన గురువుగానీ, పరస్పర దృష్టి లేదా యతి కలిగినా వాహన ప్రమాదాలు ఏర్పడును.

**14. తలనొప్పి :**

నరాలకారకుడైన బుధుడునకి తన శత్రువు గ్రహములైనా కుజుకేతువుల యతిగానీ, దృష్టికలిగినా ఆత్మకారకుడైనా రవి మానసిక కారకుడైన చంద్రుడు జాతకంలో శత్రువు గ్రహాలలో భాధించబడుతున్నప్పుడు పై చెప్పబడిన లక్షణాలు ఉంటాయి.

**15. ఆత్మహత్యా ప్రయత్నాలు :**

మనస్సుకి కారకుడైన చంద్రుడునకు తన ఆది మిత్రుడైన గురువుకు సంబంధకరమైన జాతకుడు మనస్సుని ప్రశాంతత ఏర్పడును కానీ ఆవిధముగా కాక చంద్రునకు అధిక శత్రువు గ్రహములైనా శని, రాహువు సంబంధం కలిగితే ఆత్మహత్య ప్రయత్నాలు జాతకుడు చేయును.

**విదేశీ ప్రయాణము :**

జాతకంలో గురువుని జీవకారకుడిగాను (మగవారు) శుక్రుడు జీవకారకుడు (స్త్రీలు) కర్మకారకుడైన శనికి ప్రయాణాన కారకుడైన చంద్రుడు, విదేశీకారకుడు రాహువు దృష్టి కలిగిన జాతకుడు విదేశీయానం చేయును. ఈ గ్రహం కలయిక జాతకములో చరరాశిలో జరిగిన జాతకుడు పలుదేశములలో ఉండుట, స్థిరరాశిలో జరిగిన జన్మస్థానం వదలి ఏదైన విదేశములలో స్థిరపడుట, ద్విస్వభావస్థానంలో జరిగిన జాతకుడు తన వృత్తి రీత్యా ప్రయాణము చేయట మనము గమనించవచ్చు. (జాతకమును పరిశీలించినపుడు జాతకములో 1,5,9 దృష్టిలో పాటు ప్రతి గ్రహమునకు 2,12 గ్రహములు దృష్టి మిక్కిలి అవసరము)

**విద్యాభ్యాసం :**

జాతకుని విద్యను మనం బుధునిగా వర్ణించ వచ్చు. బుధుడు జాతకములో విద్యను, వాక్‌చాతుర్యం ఇచ్చుటలో సిద్ధహస్తుడు. పరాశర మహర్షి విద్యను జాతకంలో చూడవలెనన్న బుధుని నుంచి 4వ ఇల్లు ఉన్నత విద్య, చూడవలెనన్న బుధుని నుంచి 7వ ఇంట చూడవలెనని చెప్పినాడు. ఇది ఎంతో పరిశీలించవలసిన అవసరము. బుధునికి 1,5,9 గ్రహములకు కలయిక మరియు 2,12 గ్రహముల దృష్టి మిక్కిలి ఆవశ్యకము బుధుడు వివిధ గ్రహముల కలయిక వలన కలుగు వృత్తులు.

**బుధునితో రవి :**

రవి సాంఘికశాస్త్రంలో, వేద విద్యకు, అశ్వనీకుమారులు రవి యొక్క పుత్రులు కనుక వైద్య నిర్వకారకులు కావున జాతకుడు పై విద్యలను అవలంభించును. కాని రవి దృష్టి వలన బుధునకు  అస్తంగత్వం ఏర్పడి విద్యలో పటుత్వం, అధికారం, పరిశోధన లోపించును.

**బుధునితో చంద్రుడు :**

చంద్రుడు కళలకు కారకుడు, భోజన ప్రియుడు, క్షీర కారకుడు, నదికారకుడు, కావున జాతకుడు అనగా బుధుడు చంద్రుని లక్షణాలు కలిగి పై సంబంధించిన విద్యను అనుగ్రహించును.

**బుధునితో కుజుడు :**

బుధునికి కుజుడు పరమ శత్రువు. ఒకరు దక్షిణంకు అధిపతి అయిన మరొకరు ఉత్తరంకు అధిపతి. వీరి కలయిక మూలాన విద్యలో ఆటంకములు, వివాదమలు, కుజుడు యంత్రములకు కారకుడు కనుక జాతకునికి యంత్ర సంభంధించిన విద్య ఏర్పడును.

**బుధునితో గురువు :**

దీనికి బుద్ధి విశేషిత యోగం అందురు. కాని గురువు ఇంటిలో బుధుడు నీచ కలిగినను జాతకుడు శుభగ్రహముల దృష్టివలన విద్యను పరిపూర్ణంచేయును. వాటి కలయిక వలన బోధన వృత్తి, లెక్కలు, ఆడిటింగ్, కామర్స్, జ్యోతిష్యం మొదలగునవి జాతకుడునకు ఏర్పడును.

**బుధునితో శుక్రుడు :**

బుధునకు శుక్రుడు ఆది మిత్రుడు. జాతకుని తెలివి తేటలు కాంతివలె ప్రకాశించును. వారి తెలివితేటలు ఎటువంటి విద్య అయినా చాలా సులభంగా నేర్చుకొనును. ఈ గ్రహములకు గురు సంబంధంగా కలిగి వారు విద్యలో ఉన్నత స్థాయికి చేరుకొందురు. శుక్రుడు సంజీవని విద్యకు కారకుడు కావున జాతకునకు వైద్య విద్యకు ఎనలేని కీర్తి, ప్రతిష్టలు, రోగులను అత్యవసరపరిస్థిలలో కూడా వారి వైద్యం వారికి యమపాశం నుండి దూరం చేయును.

**బుధునితో శని :**

ఈ రెండు గ్రహములు సోమరులు. శని జాతకుడు మైనింగ్ సంబంధించిన చదువు, కూర్చునిచేయు నూనెవ్యాపారం, ఇనుము వ్యాపారం వారికలయిక ఎక్కువ జాతకుడు చేయును

**బుధునితో రాహువు :**

రాహువు అనగా ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు భ్రమింపచేయు గ్రహం కావున వారి కలయిక వలన చిత్రములు, కంపూటర్లు, కెమికల్స్ ఫిజిక్స్ (సైన్స్) కు సంబంధించిన వృత్తులు ఏర్పడును.

**బుధునితో కేతువు:**

బుధునికి కేతువు శత్రువు కావున విద్యను ఆటంక పరచును. అయినప్పటికీ కేతువు మోక్షకారకుడు. న్యాయవాది, అమృతం తాగిన వాడు కావున వైద్య వృత్తికి చెందినవాడు, జ్యోతిష్యుడు కావున జాతకుడు పై సంబంధించిన చదువులు జాతకునకు ఏర్పడును.

బుధునికి అనేక గ్రహములు కలయిక కలిగిన జాతకములో అన్ని గ్రహాల ప్రభావం ఏర్పడి బుధునికి ఏర్పడి తగు సంబంధించిన విద్యలు ఏర్పడును.

ఈనాడు సమాజంలో విద్యను వివేకం కొరకు కాక వృత్తి కొరకు మనం నేర్చుకుంటున్నాము. కావున మనము విద్యతోపాటు వృత్తి, కారకుడు అయిన శని యొక్క రెండవ ఇల్లు అనగా వృత్తి ద్వారా ధనం, కావున శని నుంచి రెండవ ఇల్లు ఆలోచించిన జాతకుడు విద్యను అవలంభించిన జాతకుడు చక్కని సమర్థవంతమైన అభివృద్ధి ఏర్పరచుకొనును. పై వానిలోపాటు సహజ సిద్ధులు అయిన రాశి లక్షణములు మనం పరిగణానికి తీసుకొనవలెను.

| | | | |
|---|---|---|---|
| ఉదా : | మేషం | – | యంత్రములు |
| | వృషభం | – | ఆర్థికం |
| | మిధునం | – | కమ్యూనికేషన్ |
| | కర్కాటకం | – | జన జీవనంకు సంబంధించిన |
| | సింహం | – | రాజగృహం |
| | కన్య | – | పరిశ్రమ స్థానము |
| | తుల | – | వ్యాపారము |
| | వృశ్చికం | – | మార్మిక సంభంధం |
| | ధనస్సు | – | గ్రామీణప్రాంతము |
| | మకరం | – | కెమికల్ మరియు మైనింగ్ |
| | కుంభం | – | పరిశోధన |
| | మీనం | – | వేద విద్యలు, వైద్యవిద్య, న్యాయవృత్తి |

**గురువు, శుక్రుని ద్వారా కలుగు ఉపయోగాలు ధన యోగములు :**

జీవకారకుడు అయిన గురువు (పురుషులకు) జీవకారకుడు అయిన శుక్రుడు (స్త్రీలకు) సంబంధంకలిగిన జాతకునకు ధనము, ధాన్యము, సిరి సంపదలతో జాతకుడు తులతూగును. గురువునకు శుక్రునిలో 1,5,9 సంచారం కలిగిన గురువు ఇంటిలో శుక్రుడు, శుక్రుడు ఇంటిలో గురువు, గురువు మిత్ర, స్వక్షేత్రం, ఉచ్ఛక్షేత్రం ఉన్ననూ, శుక్రుడు తన మిత్ర, స్వక్షేత్రం, ఉచ్ఛక్షేత్రంలో ఉన్నపుడు జాతకునకు ధనము ఏదో రూపమున చేతికి అందును.

పై రెండు గ్రహములకు జాతకములో శత్రు, నీచ, పరస్పర దృష్టిలేకపోవుట జాతకుడు ధన యోగమునకు ఎక్కువ ఇబ్బందులు పడును. ధన యోగములో చంద్రుని మనకు పరిశీలించవలెను. ఎందుకనగా ఖర్చులకు కారకుడు చంద్రుడు కావున చంద్రుడు, మిత్ర, శుక్రుడు, ఉచ్ఛ క్షేత్రములు బట్టి జాతకుడు ఖర్చు పెట్టు పరిస్థితి ఏర్పడును. జాతకంలో గురువు, శుక్రులు బాగాలేనపుడు చంద్రుడు ఉచ్ఛలో ఉన్న జాతకుడు అనేక అనేక అప్పులు చేసి తద్వారా ధనంను ఖర్చు చేయును.

**జాతకములో వృత్తిని చూడడం :**

భ చక్రంలో 10 వస్థానము మకరము దానికి అధిపతి శని, శనికి రెండవ స్థానం అనగా 11వ స్థానం దానికి అధిపతి శని దానిని మనం లాభ స్థానం అని, అగ్రజ స్థానం అని కూడా అంటారు. కావున మనం వృత్తిని శనిని చూసి వృత్తి ద్వారా ఆదాయంను శని నుంచి రెండవ ఇల్లు చూడవలెను.

**శని – రవి** – రవి అనగా పితృకారకుడు, శని అనగా వృత్తి కారకుడు. కావున జాతకుని తండ్రి యొక్క వృత్తి, ప్రభుత్వం సంబంధం, వైద్యం, బియ్యం, బంగారం, మొదలగు రవి కారకాలు సంబంధించిన వ్యాపారం.

**శని–చంద్రుడు** – వృత్తి, కారకుడు అయిన శనికి, ప్రయాణ కారకుడు అయిన చంద్రుడు, కలసిన ప్రయాణాలకు సంభందించిన వృత్తి, పాలు, నీటి వ్యాపారం, హోటల్ వ్యాపారం.

**శని–కుజుడు** – శనికి కుజునకు శత్రు భేదం ఉన్న ఏనాటికి కుజునకు సంబంధించిన వృత్తి అనగా Technical నాయకత్వం, పోలీసు, యంత్రములనకు సంబంధించిన వృత్తి

**శని–బుధుడు** – శనికి వ్యాపార కారకుడు అయిన బుధునికి సంబంధం కలిగిన అకౌంటింగ్ విభాగం, వ్యాపారాలలో నూనెకి సంబంధించినది, మైనింగ్ మొదలగునవి మనం చూడవచ్చు.

**శని గురువులు –** శని, గురువులు అనగా ధర్మ, కర్మ కారకులు. కావున శనినుంచి రెండవ ఇంటిలోని గ్రహముల ద్వారా వృత్తిని నిర్ణయించి అందులో ఉన్నతిని జాతకుడు పొందును.

**శని–శుక్రుడు –** శనికి కళలకు మరియు సిరిసంపదలకు కారకుడు అయిన శనికి ఏర్పడిన మనం జాతకుని కథలకు మరియు ఫైనాన్స్ వ్యాపారంగా చూడవచ్చు.

**శని–రాహువు –** రాహువు అనగా మాయ, మోసగాడు, చలనచిత్రపరిశ్రమ, చేయు వృత్తి మరియు చదువునకు పొంతన ఉండదు.

**శని–కేతువు –** మతసంస్థలు, వైద్యం, న్యాయప్రవృత్తి. శనికి నీచ కారకుడు అయి, కుజ, కేతువుల వలన ఎక్కువ వృత్తి ఆటంకములు, చంద్రుని వలన నిందలు, రవి వలన అధికారులతో ఇబ్బంది కలుగును. వృత్తిని మనం సూచించినపుడు పై విషయములలో జాతకములో శనికి ఇరువైపుల గ్రహములు ఉన్నవి లేక ఒంటరిగా ఉన్నదా అనే విషయం గ్రహించాలి. ఒంటరిగా ఉన్న జాతకంలో జాతకుడు వృత్తిని చేపట్టి అందులో స్థిరత్వం పొందుటకు జాతకుని గురు, శుక్రుల ప్రభావములను మనం చాలా సూక్ష్మ దృష్టితో గ్రహించాలి.

**జాతకములో భార్యను గురించి తెలుసుకొనుట :**

శుక్రుడు అనగా భార్యను సూచించు గ్రహము. భ చక్రంలో ఏడవస్థానం చూపేరాశి. దానికి అది 7వ రాశి శుక్రుడు గావున భార్య కారకుడు శుక్రునిగా వర్ణిస్తారు. శుక్రుడు నీచ పొందు రాశి అనగా కన్య దానికి అధిపతి బుధుడు. జాతకుని రెండవ భార్య శుక్రుడు అనగా శ్రీదేవి మరియు బుధుడు అనగా భూదేవి. శుక్రుని వివిధ గ్రహముల కలయిక వలన మనం జాతకంలో భార్య లక్షణాలు మనం గ్రహించవచ్చు.

**శుక్రడు – రవి :** రవి అనగా క్షత్రియుడు శుక్రుడు అనగా భార్య. జాతకంలో రవి శుక్రం కలయిక వలన జాతకురాలు భార్య, రాజరిక లక్షణాలు, మంచి కుటుంబం, వాతావరణ నాయకత్వపు లక్షణాలు, కళలో ఇబ్బందులకు బాదపడునది. మాయ మోహములలో బంది అయినది. సంతానం వలన కష్టములు మొదలగునవి మనము భార్య జాతకంలో చూడవచ్చు.

**శుక్రుడు – చంద్రుడు :** జాతకురాలి భార్య ప్రయాణములు, కళలు, అభిరుచి కలది, దూరప్రాంతం నుంచి, తల్లి గారికి సంబంధం కలది. మనసు నిలకడ లేనిది. అనుమానం కలది, కఫము సంబంధించిన ఇబ్బందులు కలది. అత్తగారితో, మామగారితో సఖ్యతలేని గల భార్య లభించును.

**శుక్రుడు – కుజుడు :** శుక్రుడు అనగా భార్య కుజుడు అనగా సైన్యాధ్యక్షుడుని జాతకుని భార్య ఓరిమి, క్షమలేని, ఎక్కువ ఆర్థిక ఇబ్బందులు, సోదరుడు ఆస్తి కలిగినవాడు, భర్త కళలలో ప్రావీణ్యం, వంటకు సంబంధించి చక్కని అవగాహన, సౌష్టవం, కొంత పొట్టిగల రూపం ఉండుట, తగవులు అనగా ఇష్టం కలది మనం చూడవచ్చు.

**శుక్రుడు – బుధుడు :** శక్రుడు బుధుడు మిత్రులు కావున జాతకురాలి భార్య చాలా తెలివిగల వ్యక్తి, మంచి వాక్కు, మిక్కిలి తెలివితేటలతో ఇబ్బందులను అధిగమించడం, కాని విద్యరూపంలోని తెలివితేటలు కాకుండా బ్రతుకుటకు సంబంధించిన తెలివితేటలు కలది. చర్మసంబంధం అయిన రోగములు, జాతకుడిని భార్యకు ఇబ్బందికి గురిచేయును. బుధ, శుక్రునకు శుభ గ్రహ సంబంధం లేనిచో అనగా గురువు జాతకుని భార్యకు చక్కెరవ్యాధి వచ్చు అవకాశం కలగును.

**శుక్రుడు – గురువు :** పవిత్రురాలు, దైవచింతన, సాత్వికత, సమాజంలో చక్కని గౌరవ ప్రతిష్టలు, సిరిసంపదలు, మరియు అధిక లావు కలుగు సమస్యలు కలిగి ఉండును. జాతకునికి బుధకార కత్వములు లోపించి బుధునికి సంబంధించిన సమస్యలు చూడవచ్చు.

**శుక్రుడు – శని :** శుక్రుడు అనగా భార్య, శని అనగా వృద్ధి. భ చక్రంలో 7వ స్థానం తులరాశి అధిపతి శుక్రుడు, వృత్తి స్థానంకు అధిపతి శని. కావున వారి కలయిక వలన జాతకురాలి భార్య వృత్తిని నిర్వహించును మరియు సోమరిగా ఉండును.

**శుక్రుడు – రాహువు :** శుక్రుడు , రాహువు పరమ మిత్రులు. వారి కలయిక వలన జాతకురాలి భార్య ఆకర్షణగా ఉండును. జాతకురాలికి భవనములు ,వాహనములు ఉండుయోగం కొంత గూఢచారము, అబద్ధములు చెప్పుట,తల్లి, దండ్రులకు విరోధములు కలుగుట, కంటికి సంబంధించిన సమస్యలు కలిగి ఉండుట, భర్తకు కొంత నాగదోషము, సోదరునికి, స్థలముకు సంబందించిన సమస్యలు మొదలగునవి మనం జాతకునిలో గమనించవచ్చు.

**శుక్రుడు – కేతువు :** శుక్ర, కేతువుల వలన జాతకములోజాతకురాలి భార్య విశాల హృదయం, భర్తను ఇబ్బందులకు గరిచేయుట, అత్త, మామలను బాధించుట, పరులను, స్నేహితులను, తనవారిగా , తనవారిని పరులుగా భావించుట టెక్నికల్ఎడ్యుకేషన్ కలది. మనం గమనించవచ్చు. శుక్ర కేతువుల కలయిక వలనజాతకురాలి భర్త కుటుంబం, హఠాత్తు మరణం, వాహన ప్రమాదాలు, రాచపుండు, పంటికి సంబంధించిన సమస్యలు మనం గమనించవచ్చు.

శుక్రుని అనేక గ్రహసంభంధం వలన వివిధ గ్రహముల కార్యక్రమములకు సంభంధించి లక్షణములు జాతకురాలి భార్య మనం గ్రహించవచ్చు.

**సంతానయోగం :**

జాతకములో గురువుకి జీవకారకునిగా పేర్కొంటారు. జీవకారకునికి పుత్రకారకుడు అయిన రవి వలన జాతకునకు పుత్రయోగం ఉండును. శుక్రుని యొక్కకలయిక వలన పుత్రికయోగం ఉండును. జాతకుని పుత్రుని చూచునపుడు రవి ప్రధానమైన గ్రహము. ఎందుకనగా భ చక్రంలో 5వ ఇల్లు సంతానం, దానికి అధిపతి రవి. కావున రవి శత్రు గ్రహములు అయిన రాహు, కేతువులతో ఏది బంధం కలిగినపుడు జాతకుని పుత్రసంతానం సమస్యలు ఏర్పడును. రవికి, రాహు, కేతువు సంబంధం ప్రమాదము. గురువు చూపు వలన గాని, రవికి గురువు కలయిక, రవి రెండవ ఇంటికి గురువు ఉండినను, సమస్యలు వచ్చినను అవి చివర అంతమగును.

జాతకములో శని, శుక్రులు కలయిక వలన పిల్లలు పుట్టుటలో జాప్యము, రవి, శుక్రులు ఒకే రాశి అయిన జాతకుని పిల్లలు కలుగు అవకాశాలు సన్నగిల్లును. (రవి అనగా పుత్రకారకుడు శుక్రుడు అనగా జాతకుని వీర్యం దీని కలయిక వలన వీర్యంలో జీవకణములు అవి అగ్నికి మరణించుట, సంతానహీనత చూపుట) మొదలగునవి మనం గమనించవచ్చు.

రవి, శుక్రుడు జాతకంలో ఏస్థానంలో ఏ రాశిలోఉన్నదోమనం గమనించి దానికి ఇతర గ్రహముల దృష్టి, పరివర్తన, మని నక్షత్రములు మనం గ్రహించ వలెను.

**మోక్ష యోగం :**

భ చక్రంలో మగవారికి జీవకారకుడు, గురువు, ఆడవారికి  జీవకారకుడు శుక్రుడు, ఇరువురికి కర్మకారకుడు శనిగాను, మోక్షకారకుడు కేతువును చెప్పబడినది. కావున జాతకంలో జీవకారకునికి గాని కర్మకారకునికి మోక్షకారకుడు అయిన కేతువు సంబంధం ఉన్న  జాతకునికి మోక్ష యోగం గా వర్ణించబడును.

ఈగ్రహాలు గురువు ఉచ్ఛ పొందు కర్కాటకం, స్వక్షేత్రం అయిన ధనస్సు, మీనములు, కేతువుకు ఉచ్ఛ అయి వృశ్చికం మూల త్రికోణం అయిన మీనం ఈ యోగం ప్రబలము. కర్మకారకుడు శని వలన జాతకునికి న్యాయ పరమైనవృద్ధి ప్రావీణ్యం, ఆర్థిక ఇబ్బందులు ఒడిదుడుకులు, మోక్షమనకు సంబంధించిన జ్ఞానం మొదలగునవి మనం గమనించవచ్చు. మోక్ష కారకుడు అయిన కేతువు ఏదో ఒక యోగంను ఏర్పర్చి జాతకుని యొక్క కీర్తిని నలుమూలల వ్యాప్తింప చేయును. దానివలన కనిష్ఠులు జాతకుని నుంచి దూరం అగుట, చక్కని వాక్కు కలిగి ఉండుట దూరప్రాంతాలకు ప్రయాణించుట, అధికారుల అనుగ్రహం వంటి లక్షణములు మనం గమనించవచ్చు.

## పరిహారాలు

నవగ్రహ ధ్యాన శ్లోకములు :

రవి : జపాకుసుమ సంకాశం, కాశ్యపేయం మహాద్యుతిం
తమోరిం సర్వపాపఘ్నం, ప్రణతాస్మిదివాకరం

చంద్రుడు: దధిశంఖ తుషారాభం, క్షీరోదార్ణవ సంభవం
నమామి శశినంసోమం శంభోర్మకుట భూషణం

కుజ : ధరణీ గర్భ సంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్
కుమారం శక్తిహస్తం తం మంగళమ్ ప్రణయామ్యహమ్

బుధ : ప్రియంగు కళికాశ్యామం రూపేణ ప్రతిమం బంధం
సౌమ్యం సౌమ్యగుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్

గురు : దేవానాం చ ఋుషీణాం చ గురుం కాంచనసంనిభమ్
బుద్ధిభూతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్

శుక్ర : హిమకుందమృణాలాభం దైత్యానాం పరమం గురుమ్
సర్వవాస్త్రప్రవక్తారం భార్గవం ప్రణమామ్యహమ్

శని : నీలాంజనసమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్
ఛాయామార్తండసంభూతం తం నమామి శనైశ్చరమ్

రాహువు: అర్ధకాయం మహావీర్యం చంద్రాదిత్యవిమర్ధనమ్
సింహికాగర్భసంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్

కేతువు : పలాశపుష్ప సంకాశం తారకాగ్రహమస్తకమ్
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తం కేతుం ప్రణమామ్యహమ్

ఉదా : ఒక వ్యక్తి జాతకంలో అగ్నితత్త్వపు గ్రహములైనా రవి, కుజుడు, కేతువులు వీరు ఎవరైనా కన్యరాశిలో ఉంటే (కన్యరాశి కాలపరుష నీ అంగములలో కడుపు సంబంధించి స్థానం కావునా జాతకం చూడగానే కడుపు సంబంధించిన ఇబ్బందులు అనగా పిత్తము, వాతము) ఇదే కన్యరాశిలో శుక్రుడు నీచ పొందుట వలన రవి, కుజ, కేతువు, శుక్రుడినికి శత్రువులు కావుట వలన శుక్రుడు కూడ చాలా ఎక్కువగా ఇబ్బంది పడి శుక్రుని కారకత్వమును ఎక్కువుగా బాధించపడును. కావునా జాతకుడు కడుపును ఇబ్బంది పెట్టు రవి, కుజ, కేతువులకే కాక శక్రునకు పరిహారములు చేయవలెను. ఇక్కడ పాఠకులకు ఒక్క సందేహం వస్తుంది. శుక్రుడు జాతకంలో కన్యరాశిలో లేదు? దానికి పరిహారములు ఎందుకు చేయాలి? ఒక గ్రహం ఒక రాశిలోకి వస్తే అందులో కనబడు 9 గ్రహాలుంటాయి. అవి ఏ విధముగా ఫలితం ఇచ్చునంటే ఆ రాశి నాథునకు శత్రువులు, మిత్రులు ఏ విధముగా ఫలితాలు ఇస్తాయో అదే ఫలితమును ఆ రాశి ఇంట్లోకి వచ్చిన గ్రహమునకు అనే ఫలితమును ఇస్తాయి. వీటి గురించి నా యొక్క తదుపరి పుస్తకంలో పొందుపరుచుకున్నాము. అందులో ఊహజనితమైన గ్రహము వలన కూడా వచ్చు ఫలితములు చూడవచ్చును.

మనకు జాతక విభాగంలో 9 గ్రహాలు, 27 నక్షత్రాలు, 12 రాశులు వీటి ద్వారానే మనకు తెలిసే విషయాన్ని, తెలిసిన విషయాన్ని మరియు తెలియబోయే విషయాన్ని గ్రహముల కారకత్వము ద్వారా మనం నేర్చుకొన్న వచ్చును. మనము జ్యోతిషమును పక్షుల ద్వారా, జంతువులు ద్వారా, మొక్కల ద్వారా, దుస్తుల ద్వారా శరీర అంగముల ద్వారా, నిత్యవసర సరుకులు ద్వారా, బంధుత్వం ద్వారా మరియు అనేక పద్ధతుల ద్వారా మనము గ్రహము యొక్క కారకత్వమును గ్రహించి మనకు మనమే పరిహారమును సృష్టించి తత్ద్వారా సత్ఫలితమును పొందవచ్చును.

**రవి:** ఎద్దు, జింక, బాతు, సింహము, ఆడమేక, పులి, జిల్లేడు చెట్టు, మందారచెట్టు, బిల్వచెట్టు, రుద్రాక్షచెట్టు, గంధపుచెట్టు, గోధుమపంట, తూర్పు దిక్కు, జ్యోతిక, side కిటికీ, తండ్రి, కొడుకు, కెంపు, pepper, అల్లం, యాలకులు, పురుషుడు అదిత్యహృదయం, గోధములు, సూర్యనారాయణుడు, కుడికన్ను, వైద్యుడు, క్షత్రియుడు,రాజకీయనాయకుడు, గవర్నమెంట్ అధికారి, గుండె మొదలైనవి,

**చంద్ర:** తల్లి, అత్త, మేనత్త, పిన్ని, వంటవారు, కళాకారులు, జ్యోతిషులు, ఎడమకన్ను, గర్భసంచి, చాతి, ప్రాకే జంతువులు, నక్క, మునగకాయలు, ఔషదాలు, బియ్యపుపంట, అరటివృక్షం, చెరుకు, స్నానాలగది, కీరపానాలు, ఎడమవైపు కిటికీ, వంటసామానులు, సబ్బులు, వెండి, పెరుగుఅన్నం, ప్రయాణాలు, ఖర్చులు, ముత్యములు, లలితా త్రిపుర సుందరి, లక్ష్మీదేవి మరియు పార్వతి.

**కుజ:** పోరాటయోధుడు, తమ్ముడు, భర్త, ఎముక, పళ్ళు, కనుబొమ్మలు, వెన్ను ఎముక, testicals, కోడి,కుక్క, పాము, కొమ్ములు ఉన్న జంతువులు, కోతి,హంస రాబంధు, నిమ్మచెట్టు, ముళ్ళచెట్టు, సిందూరం, వంటగది, దువ్వెన, పగడం, కుమారస్వామి, కందులు, రాగి, అల్లం, ఎర్రగడ్డ, మిరపకాయ, ఆటలు, technical education,యంత్రములు.

**బుధుడు:** వైశ్యుడు, మేనమామ, ఆఖరిసోదరి, సోదరుడు, బంధువులు, మిత్రులు, న్యాయవాది, గురువు, జ్యోతిష్యుడు, నుదురు, భుజములు, యెద, చేతులు, నాలుక, పిల్ల, గారము, గ్రద్ద, ఆకుకూరలు,Tulsi ,ఉత్తరచెట్టు పచ్చరాయి, విష్ణుమూర్తి, మధ్యవ్యక్తి, లెక్కలు చూచువాడు.

**గురువు:** బ్రాహ్మణుడు, జీవకారకుడు, కఫము, ముక్కు, పాదములు, తొడలు, తియ్యనిపదార్థాలు, అప్పుఇచ్చువాడు, న్యాయవాది, పూజారి, పూజగృహము, ఆవు, ఏనుగు, హంస, చెయ్యి, కారాగారము, కొబ్బరి బొండము, కనక పుష్యరాగం, గురుస్తోత్రం, దక్షణామూర్తి మరియు ఆలయాలు.

**శుక్రుడు:** స్త్రీ కారకుడు, భార్య, అక్క, కూతురు,కోడలు, బ్రాహ్మణుడు, కఫము, మధ్యము, ఇల్లు, వాహనం, అందగాడు, బట్టల వ్యాపారి, కుదువ అంగడి, చక్కెరవ్యాధి, శుకవ్యాధి, వీర్యం, కడుపు వృత్తి, ఆవు, చిలక, నెమలి, బొబ్బర్లు, మామిడిచెట్టు, చింతపండు, నిమ్మచెట్టు, పడకగది, అద్దము, పుచ్చకాయ, పసుపు, బంగారము, లక్ష్మీదేవి మరియు వజ్రం.

**శని:** సేవకుడు, అన్న, కాళ్ళు, పిరుదులు, ఆయాసం, గడ్డం, వాతము, మాటసరిగా రాకుండ ఉండుట, వారసత్వపు ఆస్తి, సేవకవృత్తులు, నువ్వులు, చెత్తబుట్ట,Dining table, ఇంద్రనీలం, కాకి, కోయిల, ఎలుగుబంటి, బర్రె, గాడిద, పంది, కాకరకాయ, పొగాకు, నూనె, ఇనుము, రుద్రాభిషేకం, హనుమంతుడు, ఈశ్వరుడు.

**రాహువు:** తక్కువ కులమువాడు, సన్నగా, పొడవు కలిగిన వ్యక్తి, దొంగ, చవిని తట్టుకోలేనివాడు, పితామహుడు, నీరు, విదేశి, ఆకర్షణీయమైన వృత్తులు, చెప్పువాడు, గుడ్లగూబ, పాము, తోడేలు, సర్పగంధవృక్షం, బబ్బులువృక్షం, గోమేధికం, నోరు, ముస్లిం, దుర్గాదేవి, మినుములు

**కేతువు:** తాతయ్య, మోక్షకారకుడు, జ్యోతిష్యం, వైద్యం, న్యాయవాది, పీత్తం, కుష్టివ్యాధి, వెంట్రుకలు, చర్మసంబంధన రోగాలు, పురుషునీ అంగము, గడ్డం, ఉడుత, నలుపురంగులు, తాళ్ళు, వైద్యుం, వినాయకుడు, హనుమంతుడు, ఉలవలు.

పై చెప్పబడిన గ్రహకారాకత్వం ఆధారంగా మనకు మనంగా పరిష్కార మార్గమును ఏర్పరుచుకొని తత్ద్వారా ఫలితం పొందుటకు మిక్కిలి దోహద పడును.

(జన్మతహ వచ్చిన జాతకము పరిష్కార మార్గం ద్వారా వచ్చిన ఇబ్బందిని కొంచెం తక్కువ చేయునేగాని పూర్తిగాతొలగించెదు)

మనకు భృగుసంయంతలో అగ్నితత్త్వరాశులలో గ్రహములు శాంతింప చేయుటకు యజ్ఞములు, హోమములు, వాయుతత్వ రాశులలో గ్రహములు శాంతింపచేయుటకు ప్రార్థనలు, భూతత్వ రాశులో గ్రహములు శాంతింపచేయుటకు పూజలు, జలతత్వ రాశులో గ్రహములు శాంతింపచేయుటకు అభిషేకములు సూచించుచున్నది.

**పంచమహాపురుషయోగములు:**

1. ఐదు యోగములలో ఒక్కటి వున్నను అదృష్టశాలి
2. ఐదు యోగములలో రెండు వున్నను రాజసమానుడు
3. ఐదు యోగములలో మూడు వున్నను రాజు
4. ఐదు యోగములలో నాలుగు వున్నను చక్రవర్తి
5. ఐదు యోగములలో ఐదు వున్నను చక్రవర్తి మించినవాడు

6. కాని ఐదు యోగముల ఒక్కరికీ వుండవు. అనగా బుధ, శుక్ర ఉచ్చస్థితి ఒకే సమయమున జరగవు. ఇక స్వక్షేత్రమన ఉండుట జరుగును. ఒక రవిగ్రహముతో కలయిక అస్తంగత్వ దోషము కలుగును.

7. చంద్ర మంగళ యోగము: చంద్ర కుజుడు కలసి వున్నచో చంద్ర మంగళయోగము అందురు. ఈ యోగమున జన్మించిన వారు అనేక విధముగా ధన సంపాదన కలవారు అగును.

**భద్రయోగము :**

బుధుని ఉచ్ఛస్థితిగా ఈ యోగము ఏర్పడును. జాతకుని వాక్పటుత్వము, వేద విజ్ఞానములు, దీర్ఘాయుష్యను ఉండును. బుధుడు ఉచ్ఛ స్వక్షేత్రములైన కన్య మిధునములలో కేంద్రస్థితి పొందిన ఈ యోగము ఏర్పడును.

**హంసయోగము:**

గురుని ఉచ్ఛస్థితిగా ఈ యోగము ఏర్పడును. మధుర కంఠధ్వని, ధర్మమార్గంలో ఉదార స్వభావములో యోగులతో, జ్ఞానులతో మంచి సంబంధ బాంధవ్యములు ఉండును. రాజకీయముగా కూడా మంచి పేరు ఉండును. గురువు, ధనుస్సు, మీన, కర్కాటక రాశులలో కేంద్రములో వున్నచో ఈ యోగము ఏర్పడును.

**మాలవ్య యోగము:**

శుక్రుని ఉచ్ఛస్థితిగా ఈ యోగము ఏర్పడును. సంగీత సాహిత్యముల యందు విపరీతమైన అభిరుచి ఆకర్షణీయమైన ఆకారము రకరకాల ఆభరణాలు ధరించి యుందురు. శుక్రుడు వృషభ, తుల, మీనములలో కేంద్రస్థితి పొందిన ఈయోగము ఏర్పడును. →

**ఉదాహరణ జాతకములు:**

హంస, శశి, రుచక, మాలవ్య యోగములు కలవారు శ్రీరామచంద్రుడు.

1. గురువు ఉచ్ఛస్థితి హంసయోగము
2. శని ఉచ్ఛస్థితి శశాయోగము
3. కుజ ఉచ్ఛస్థితి రుచక యోగము
4. శుక్ర ఉచ్ఛస్థితి మాలవ్యయోగము
5. గురు చంద్రుల కలయిక లగ్నంలో గజకేశరీయోగము
6. రవి బుధుల కలయిక దశమంలో బుధానిత్యయోగము

జాతకం పరిశీలించు విధానం

పుట్టినతేది 14-7-1978

పుట్టినసమయం 8.30 pm

ప్రదేశం Nlr

| | | | |
|---|---|---|---|
| కేతు | | | రవి గురు |
| | రాశి | | బుధ |
| లగ్నం | | | శుక్ర, కుజ శని |
| | | చంద్ర | రాహు |

ఈ ఉదాహరణ జాతకంలో పాఠకులకు అర్థమైన విధంగా వివరించబడినది (పరాశరమతం, భృగుమతపద్ధతిలో జాతకపరిశీలన).

1. **పరాశరమతం:** ఈ జాతకములో లగ్నమునకు అధిపతి అయిన శని అష్టములో ఉండుట వలన పంచమునకు దశమునకు అధిపతి అయిన శుక్రుడుతో మరియు చతుర్థమునకు లాభకారకునకు అధిపతి అయిన కుజునితో కలయిక పై లక్షణముల వలన జాతకురాలు అదృష్టం పొందినను (కేంద్ర, కోశాదిపతియోగం) అష్టమం కావున జాతకురాలు ఎప్పుడును సమస్యలు కలిగి తద్వారా బుధు సంబంధిన సమస్యలు కలుగును.

1. **భృగునాడి:** ఆడవారికి జీవకారకుడు అయిన శుక్రుడు, వృత్తికారకుడు అయిన శని, పరాక్రమం, భర్త కారకుడు అయిన కుజుని తో ఉండుట మరియు రవికేంద్రంలో ఉండుట వలన జాతకురాలు ఉష్ణంనకు సంబంధించి, బుధునికి సంధించిన సమస్యలు, సింహంలో ఉండుట వలన రాజరిక లక్షణాలు మనం గమనించవచ్చు.

2. **పరాశరమతం:** ధనస్థానదిపది అయిన శని మకర లగ్నంకు అష్టమంలో ఉండుట, లాభాధిపతి మరియు ఉద్యోగ స్థానం చెందిన గ్రహంతో కలియుట వలన ఉద్యోగం ద్వారా ధన సంపాదన కలిగి ఉండును.

2. **భృగునాడి:** జీవకారకుడు అయిన శుక్రుడు ఉద్యోగకారకుడు, అయిన శని, ఆదాయంకు కారకుడు అయిన కుజునితో కలయిక వలన జాతకురాలు ధనంను ఉద్యోగం ద్వారా, భర్త ద్వారా వచ్చునని తెలియచున్నది.

3. **పరాశరమతం:** పరాక్రమ స్థానాదిపది మరియు కనిష్టులకు అధిపతి అయిన గురువు లగ్నంకు 6వ స్థానంలో ఉండుట, 8వ ఇంటి అధిపతిలో కలయిక వలన (ఉపచయములు అయిన 3,6,10,11లో పాప గ్రహములు) జీవకారకులు యొక్క పరాక్రమము, విధానములలో గొప్పనేర్పుఉండును.

3. **భృగునాడి:** క్షత్రియకారకుడు అయిన రవి మిధునంలో ఉండుట, బ్రాహ్మణుని హరించే గురువుతో కలయిక వలన దానిని రాజ, ప్రయోగయోగంగా మనం పేర్కొనవచ్చు. దానివలన రాజుయొక్క లక్షణాలు ఈ జాతకురాలిలో పనిచేసి చక్కగా జనులను ఆకట్టుకొనును.

4. **పరాశరమతం :** చతుర్థస్థానంకు అధిపతి మరియు చదువునకు అధిపతి అయిన కుజుడు, తనస్థానంకు పంచమం అనగా 8లో పడుట వలన, 8 త్రికము అయినందువలన విద్యార్థి జీవనంలో జాతకురాలు ఎక్కువ ఒత్తిడులకు లోనుకావుట, అది రవి చెందిన స్థానం కావుట వలన చివరలో విజయం సాధించుట చూడవచ్చు.

4. **భృగునాడి :** చదువుకు కారకుడు అయిన బుధుడు, కర్కాటకంలో ఒంటరిగా ఉండి, తనకు మిత్రులు అయిన శని, శుక్రుడు రెండవ ఇంటిలో ఉండుట వలన విద్య ద్వారా గుర్తింపు మరియు రెండవక్షేత్రంలో బుధునికి శుత్రువు అయిన కుజుడు ఉండుట వలన విద్యాభ్యాసంలో అవరోధాలు, దాని అధిపతి అని, గురునితో కలయిక వలన జాతకురాలు అన్ని అవరోధాలు అధికమించును.

**5. పరాశరమతం:** సంతానమునకు అధిపతి అయిన శుక్రుడు లగ్నం నుండి అష్టంలో, తన స్థానంకు చతుర్థంలో ఉండుట వలన సంతానం వలన సుఖసంతోషాలు మరియు సంతానం వచ్చిన తర్వాత , ఇల్లు, స్థలం, రాహువు లగ్నం నుంచి అష్టమ స్థానం కనుక పిల్లలను పెంచుటలో కొంత ఇబ్బందులు ఏర్పడును. 8వ స్థానం రవి ఉన్న ప్రదేశం కావున ఆ చిక్కులను తన ఆత్మస్థైర్యంతో పరిష్కరించుకొనును.

**5. భృగునాడి :** పురుష సంతాన కారకుడు అయిన రవి, గురువుతోను, స్త్రీ సంతాన కారకుడు అయిన శుక్రుడు ఇంటిలో ఉండుట మరియు కుజునితో ఇదే క్షేత్రంలో ఉండుటవలన పుత్రిక మొండిగాను, ద్వితియార్థంలో అనగా తర్వాత క్షేత్రం కన్య కనుక మొండితనం పోవునుయ రవిక్షేత్రంలో శుక్రుడు ఉండినందువల్ల జాతకురాలి కూతురు, అల్లుడు చాలా ఉచ్ఛస్థితిలోను, పురుష సంతాన కారకుడు అయిన రవి, గురువుని తో కలయిక చంద్రుని చూపు ఉండుట వలన పుత్రునకు గజకేసరియోగం ఏర్పడును.

**6. పరాశరమతం:** జాతకంలో ఋణ,రోగ, శత్రు స్థానములకు అధిపతి అయిన బుధుడు సప్తమంలో ఉండుట వలన జాతకురాలుకు భర్త సంభంధించి కొంత వివాదములు ఏర్పడును. కాని తన స్థానాదిపది అయిన చంద్రుడు రాజ్యస్థానంలో ఉండుట వలన జాతకురాలు సమస్యలు తొలగించుకొన కలదు.

**6. భృగునాడి :** ఈ జాతకంలో గురువునుంచి 5వ ఇంటిలో చంద్రుడు ఉండుటవలన జాతకురాలు గజ, కేసరి యోగం పరుని శత్రువులను ఖండించును.

**7. పరాశరమతం:** జాతకంలో 7వ ఇంటి అధిపతి పదవస్థానంలో ఉండుటవలన జాతకురాలకు ఉద్యోగం చేయి భర్త వచ్చును. తత్‌స్థానమునకు అధిపతి అయిన శుక్రుడు, తత్‌స్థానమునకు లాభంలో ఉండుట వలన భర్త ద్వారా ఎక్కువ లాభము పొందును.

**7. భృగునాడి :** వృత్తి, కారకుని కలయిక, ధనకారకుడు అయిన శుక్రునితో కలయిక వలన జాతకురాలు ఉద్యోగం చేయుభర్త, దాని ద్వారా భర్తయొక్క ఆదాయం అనుభవించును.

**8. పరాశరమతం:** మాంగల్యం, ఆయుష్య, సేనాధిపతి అయిన రవి, వ్యయకారకుడు అయిన గురువుతో కలసి, లగ్నమునకు 6వ స్థానంలో ఉండుట వలన జాతకురాలు మాంగల్యయోగం కలదది అని మరియు మధ్యమ ఆయువు (65) కలది అని మరియు కొంత దీర్ఘకాల వ్యాధులు జాతకురాలని ఇబ్బందికి గురిచేయును.

**8. భృగునాడి :** జీవ కారకుడు అయిన శుక్రుడు సింహరాశిలో ఉండుట, అది తనకు శత్రుక్షేత్రం అగుట అందులో తనుకు శత్రువు అయిన కుజునిలో ఉండుట, చంద్రుడు 3వ ఇంటిలో ఉండుట వలన, కుజుడు, రవికి మిత్రక్షేత్రం అగుట జాతకురాలు మాంగళ్యం గట్టిది అని మరియు, జాతకురాలు మధ్యమ అయుష్య అని (55) రవిస్థానం కనుక అదృష్టవంతురాలు అని చెప్పవచ్చు.

**9. పరాశరమతం :** లగ్నంకు 9వ ఇంటివాడు అయిన బుధుడు సప్తమంలో ఉండుట వలన జాతకుడు తండ్రి, మరియు హై ఎద్యుకేషన్, విదేశీయానం అన్ని జాతకురాలు పొందును.

**9.** **భృగునాడి:** జాతకురాలు జాతకంలో బుధుడు చదువుని సూచించు గ్రహం కావున బుధుని నుంచి 9వ స్థానంకు అధిపతి అయిన గురువు, బుధునకు వ్యయస్థానం ఉండుట వలన బుధుడు, పబ్లిక్ సంబంధించి కర్కాటకంలో ఉండుటవలన, గురువులో తండ్రికారకుడు అయిన రవి కలయిక వలన జాతకురాలకు హై ఎడ్యుకేషన్ విదేశీ యానం, రవికి గురు కలయిక వలన జాతకురాలి తండ్రికి జాతకురాలు వలన చాలాబాగా కలిసి వచ్చింది అని చెప్పవచ్చు.

**10.** **పరాశరమతం:** జాతకురాలు 10వ ఇంటి అధిపతి అయిన శుక్రుడు లగ్నంకు అష్టమంలో ఉండుట, తత్‌స్థానంకు లాభంతో ఉండుటవలన ఉద్యోగ స్థానమునకు అధిపతి అయిన శుక్రుడు. లాభం మరియు 4వ ఇల్లు సూచించు కుజునితో 2 మరియు 3 ఇల్లు సూచించే శనితో కలయిక వలన 8కు సంబంధించిన 11వ ఇల్లు అగ్రస్థానం అనగా ఉద్యోగంలో పెత్తనం చేయు అధికారం, టెక్నికల్ ఎడ్యకేషన్‌లో ఉండునని చెప్పవచ్చు.

**10. భృగునాడి :** జాతకురాలు సహజ ఉద్యోగకారకుడు అయిన శనితో, జాతకురాలు అయిన శుక్రుడు కలయిక, టెక్నికల్ కారకుడు కుజుని కలయిక వలన జాతకురాలు మరియు భర్త, ఉద్యోగము కారకుడు శని నుంచి మరియు కుజుని నుంచి రెండవ ఇంటిలో రాహువు ఉండుటవలన జాతకురాలు రాహువు సంబంధించిన వృత్తులు చేపట్టడం జరుగును. రవిస్థానం కనుక ఉద్యోగ రంగ సంస్థలు అనుకూలంగా ఉండును.

**11.** **పరాశరమతం:** లాభస్థానంకు అధిపతి అయిన కుజుడు, లగ్నంకు అష్టమంలో ఉండుట వలన జాతకురాలకు friends, relations, ....... లోను అనుకూలత ఉండదు.

**11.** **భృగునాడి:** జాతకంలో Education, friends, relations, patnerships కు అధిపతి అయిన బుధుడు తనకు శత్రువు అయిన చంద్రుడు మరియు నీలాపనిందలు పొందిన వ్యక్తి యొక్క క్షేత్రంలో ఉండుటవలన జాతకురాలికి పైసంబంధించిన వృత్తిలలో సత్‌ఫలితాలు ఉండవు.

**12.** **పరాశరమతం:** వ్యయంకు అధిపతి అయిన గురువు లగ్నంకు 6 ఇంటిలో ఉండుటవలన శత్రువుల మూలకంగా అధిక ఖర్చులు, నిద్రలేమి చెప్పవచ్చు.

**12.** **భృగునాడి:** ఖర్చులకు కారకుడు అయిన చంద్రుడు శుక్రుడు ఇంటిలో ఉండుట, శుక్రునికి వ్యయం చంద్రుని ఇల్లు అగుట వలన జాతకురాలికి అధిక ఖర్చు, నిద్రలేమి ఉండును.

ఈ విధంగా ప్రతియొక్క విషయంను జాతకంలో అనేక విధములుగా చర్చించి ఫలితం రాబట్టుకొనవచ్చు. పద్ధతులు వేరు అయిన ఫలితము ఒక్కటే కాని భృగునాడిలో లగ్నం, రాశి, దశ, సమయం అవసరం లేకుండా ఫలితం కనుగొనవచ్చు. కాని పరాశర పద్ధతిలో సమయం ఖచ్చితంగా ఉండాలి. ఫలిత నిర్ధారణలో గోచారంలో పరిభ్రమించు 9 గ్రహాలు, రాశి శని 9 గ్రహములలో పరిశీలించి ఫలిత నిర్ధారణ చేయవలెను. ఇక్కడ ప్రతి గ్రహమునకు 1,5,9,7 భృగువులో ఉండును. రాహు, కేతువులకు 7వ దృష్టి మాత్రం ఉండదు. పై జాతక చక్రంలో బుధుని ద్వారా, జాతకురాలి మేనమామ, కనిష్ఠుడు అయిన సోదరుని జాతకం చూడవద్దు. ఈ జాతకంలో

